


సంపుటి: 2 సంచిక: 6 పుటలు: 68 విడి ప్రతి వెల: 25 సెప్టెంబర్ 2016



**Editor:** Narayana Sarma

**Owned, Printed and Published by:**
Kottapalli Prachuranalu,
1-127/A, Near MRO Office,
Chennekothapalli,
Ananthapuramu District
Andhra Pradesh-515101
Website: http://kottapalli.in
Email: team@kottapalli.in
Phone: 7702877670

**Printed at:**
Mudrica Offset Printers,
Sanyasi Raju street,
Gandhi Nagar,
Vijayawada,
Andhra Pradesh
Phone: 08662579129

**RNI Registration No:** APTEL/2014/62705
**Postal Registration No:** HDP/008/2015-17

**సంపాదకులు:** నారాయణ శర్మ

**గౌరవ సలహాదారు:** యు. సుబ్బరాజు

**ప్రచురణ:**

కొత్తపల్లి ప్రచురణలు, చెన్నేకొత్తపల్లి

**యాజమాన్యం:**

సత్య - ఫౌండేషన్ ఫర్ ఎ హెల్దీ సొసైటీ, చెన్నూరు.

**చిత్రాలు:**

అడవి రాముడు : 9491870753

వీరాంజనేయులు : 7799260684

ఫైనార్ట్స్ చదువుతున్న ఇతర మిత్రులు కూడా.

**వెబ్సైటు నిర్వహణ:**

ఆనంద్, లక్ష్మి

**వాణిజ్యం, మార్కెటింగు:**

కె. మల్లికార్జున: 9000453887




# విషయ సూచిక

## పరిచయం..

బతుకమ్మ పండుగ ఈ నెల మూఫ్ఫైన మొదలవుతున్నది. తెలంగాణలో ఊరూరా పిల్లలు, పెద్దలు పూలతో బతుకమ్మల్ని పేర్చి సంబరాలు జరుపుకుంటారు; బతుకు తల్లిని కొలుస్తారు. తొమ్మిది రోజుల బతుకమ్మ పండుగ ద్వారా మనం ప్రకృతికి ఎంత దగ్గరగా ఉండాలో తెలుసుకుందాం. అందరికీ బతుకమ్మ పండుగ శుభాకాంక్షలు!

ప్రాచీన తెలుగు కవుల్ని సంస్కృతభాష ప్రభావితం చేసినంతగా మరే భాషా ప్రభావితం చెయ్యలేదు. మన గ్రంథాల్ని తప్పులేకుండా అర్థం చేసుకోవాలంటే కొద్దో-గొప్పో సంస్కృతం వస్తేనే మంచిది. మరి ఆ సంస్కృతాన్ని కూడా కథలతో పరిచయం చేస్తే ఎంత బాగుంటుంది! చమత్కార శ్లోకాల్ని, వాటి వెనక కథల్ని ఒకటొకటిగా ఈ మాసం నుండి మనకు తెలియజేసేందుకు అంగీకరించారు, ఇయన్వీ రవిగారు. వారికి ధన్యవాదాలు.

'ఏదో ఒక పని- చేస్తూ పోతే- ఏదో ఒకటి అవుతుంది' అని నవ్వు నవ్వుగా చెప్పే మూడంచెల ధారావాహిక- 'నేతగాడు-డ్రాగన్' మొదటి అంచెను ఈ సంచికలో చదవండి; మరి ఏదో ఒక మంచి పనిని ధైర్యంగా చేస్తూ పోండి! ముందైతే ఈ కొత్తపల్లినంతా చదివెయ్యండి!! 




---

చెలగరు కలగరు సాధులు
మిళితములయి పరుల వలన మేలున్ కీడున్
నెలకొనిననైన నాత్మకు
నొలయవు సుఖ దు:ఖ చయములుగ్రములగుచున్

భావం: సజ్జనులు ఇతరుల వల్ల మేలు జరిగితే పొంగిపోరు; కీడు జరిగితే క్రుంగిపోరు; సుఖాలు, దు:ఖాలు ఎంత బలంగా వచ్చి చుట్టుకున్నా సరే, గొప్పవారి ఆత్మలను మాత్రం అవి అంటుకొనవు.

సందర్భం: శమీకుడనే ఋషి మెడలో చచ్చిన పామును, వేస్తాడు పరీక్షిత్తు అనే రాజు. దాంతో శమీకుడి కొడుకైన శృంగి కోపం ఆపుకోలేక, పరీక్షిత్తును శపిస్తాడు. అది తెల్సిన శమీకుడు తన కొడుకుని మందలిస్తూ ఈ సంగతిని గుర్తుచేస్తాడు- మంచివాళ్ళు ఎలా ఉండాలో చెబుతాడు,

# అమ్మ-స్నేహం

ఏడో తరగతి రాము ఏడుస్తున్నాడు.

వాడు అడిగింది ఒక పెన్ను కావాలని. అంతేగా? దానికి అమ్మ ఎంతలేసి మాటలు అన్నది?! 'డబ్బులు లేవురా, కూలి డబ్బులు వొచ్చాక, వచ్చే వారం చూద్దాం' అనిన్నా అని ఉంటే తను ఏడవక పోవును - సూరిగాడి దగ్గర అప్పుగా తీసుకొని పని నడిపించుకొనేవాడు!

కానీ ఏమన్నదో చూడు-"ఇట్లా డబ్బులు తగలేస్తావుంటే యలా? మొన్ననే పది కావాలంటే ఇస్తి. పరీచ్చకి ఎంది కావాలంటే ఇస్తి. బెండకప్ప పండక్కి చొక్కాయి కొనుక్కుందికి నాలుగొందలైపాయె. 'ఇంకా డబ్బులు తే, డబ్బులు తే' అంటే నేనేమైనా రూపాయిలు అచ్చేత్తన్నానా? ఇగో చెప్తన్నా! పైసా ఇచ్చేది లేదు! చదివితే చదువు- లేకపోతే మానెయ్, అంతే!" అనింది.

తనేమైనా డబ్బులు తగలేస్తున్నాడా, సూరిగాడి మాదిరి? వాడు బడికి రోజూ డబ్బులు తెచ్చుకుంటాడు. ఇంటర్వెల్లో పోయి ఏవేవో కొనుక్కొని తింటాడు. దగ్గరున్న వాళ్లకూ పెడతాడనుకో; అయినా ఆ డబ్బులు ఊరికే రాలేదు కద, వాళ్లమ్మ వాళ్లు కష్టపడితేనేగా, అవి వొచ్చింది?

వాళ్ల బడిలో సరస్వతీ దేవి విగ్రహం ఒకటుంది. రాము దాని ఎదుట నిలబడి, ఇదంతా గుర్తు చేసుకొని కళ్లనీళ్లు పెట్టుకున్నాడు. అంతలో ఉరుము ఉరిమినట్లైంది. "ఊరికే ఏడవకు! నీకేమైందో చెప్పు- అంతే. ఏడుపు ఏడందాలా నష్టం!" అని వినిపించింది సరస్వతి విగ్రహంలోంచి.

రాము బిత్తరపోయి చూసాడు: సరస్వతీ దేవి మాట్లాడింది- సూరిగాడి గొంతులో!

'ఇగో సూరీ, నీ పన్జెప్తా. మర్యాదగా బయటికొస్తావా, లేదా?" అని ఆవేశంగా వెనక్కి, ముందుకీ తిరిగి చూసాడు రాము. అక్కడెవ్వరూ లేరు!!



సూరిగాడి గొంతు నవ్వింది. "కాదులే, నీకు నమ్మకం లేదు. ఇంతకీ ఎందుకేడుస్తున్నావ్?" అంది.

"నీ గొంతు సూరిగాడి గొంతులాగా ఎందుకుంది?" అన్నాడు రాము, అనుమానంగా.

"ప్రశ్నకి జవాబు ప్రశ్నకాదు!" అరిచింది గొంతు. ~~ఈసారి~~ అది లక్ష్మయ్య సారు గొంతులాగా అనిపించింది.

"మీర్..మీరే గద సార్, పెన్ను తెచ్చుకొమ్మన్నది?! మా అమ్మని డబ్బులడిగితే,.. లేవని, తిట్టింది!" చెప్పేశాడు, మర్యాదగా చేతులు కట్టుకొని.

"సూరిగాడిని అడుగు... లేకపోతే ఓ పని చెయ్.. ఇంటర్వెల్ తర్వాత వొచ్చి చూడు- నా కుంకుమ గిన్నెలో ఐదు రూపాయలుంట్లై. తీసుకెళ్లు!" అంది లక్ష్మయ్య సార్ గొంతు. 'థాంక్యు- థాంక్యు సర్!' అన్నాడు రాము, గడబిడ పడిపోతూ.

'సరస్వతీ దేవిని సర్ అనేవాడిని నిన్నొక్కడినే చూసాను." నవ్వింది సూరిగాడి గొంతు. "అయినా గుర్తుంచుకో, ఇది నేను నీకిస్తున్న అప్పు! కష్టాల్లో ఉన్నవాళ్లని ఎవరినైనా నువ్వు నీ సొంత ఐదు ఇచ్చి ఆదుకోవాలి, పెద్దయ్యేలోపు!" అన్నది.

ఇంటర్వెల్ తర్వాత చూస్తే కుంకుమ బరిణ క్రింద ఐదు రూపాయలు పెట్టి ఉన్నై! రాముకి

ప్రాణం లేచి వచ్చినట్లైంది. సరస్వతికి దణ్ణం పెట్టుకొని, ఆ డబ్బులు తీసుకెళ్లి పెన్ను కొనుక్కున్నాడు.

ఆ రోజు సాయంత్రం రాము వాళ్లమ్మ వాడిని పిలిచి చేతిలో ఐదు రూపాయలు పెట్టింది. "ఇగో, నిన్న అడిగావ్‌గా!! పెన్ను కోసం!" అంది.

'అవసరం లేదులే, నిన్న ఎవరో అప్పిచ్చారు!" అన్నాడు రాము.

అమ్మ అనుమానంగా చూసింది-"ఎవురిచ్చారు? అయినా ఎవురినో నువ్వెందుకు అడిగావు?!" అంది.

"సరస్వతీ దేవి- కాదు- సూరిగాడు- కాదు- నేను ఏడుస్తుంటే చూళ్లేక- "వాక్యం పూర్తి చెయ్యలేదు రాము.

"ఇవి తీసుకెళ్లి, ఇచ్చెయ్- ఎవరి దగ్గర తీస్కున్నావో వాళ్లకి!" అంది అమ్మ. "ఇంతకీ సరస్వతీ దేవి ఎవరు?" అంది, కొంచెం ఆగి.

మరుసటి రోజున ఇంటర్వెల్లో సరస్వతీ దేవికి మొక్కుకొని, ఐదు రాపాయల్ని కుంకుమ బరిణె కింద పెట్టబోయాడు రాము.



"సూరిగాడికిచ్చెయ్. ఇవి 'నావే'!" అంది సరస్వతీ దేవి- సూరిగాడి గొంతు పెట్టుకొని.

"ఇదేదో తేడాగా ఉందే!" అని మళ్లీ ఓసారి విగ్రహం చూట్టూ తిరిగి చూసాడు రాము.

ఎవ్వరూ లేరు-"నీకు ఏదీ కనిపించదు. ఎప్పుడూ క్రింది చూపే ఉంటే ఎలా? పై చూపు కూడా కావాలి!" అన్నది సూరిగాడి గొంతు. రాము చటుక్కున పైకి చూసాడు.

సరస్వతీ దేవి మంటపం వెనక ఓ వేప చెట్టుంది. దాని కొమ్మల్లో కూర్చొని, కాళ్లూపుతూ ఇకిలిస్తూ "థాంక్యూ. థాంక్యూ సర్" అని లక్ష్మయ్యసార్ గొంతుతో పలుకుతున్నాడు- సూరి! రాము సూరిగాడిని కొట్టేందుకు పోతే, వాడు అందకుండా క్రిందికి దూకి తరగతిలోకి పరుగుపెట్టాడు!

మంచి అమ్మలు, చక్కని స్నేహితులు- నిజంగా గొప్పవాళ్ళు! కదూ?!

మంచి అమ్మలకు, మంచి స్నేహితులకు అభినందనలతో,

కొత్తపల్లి బృందం.

స్వాగతం!

**కొత్తపల్లి**లో పిల్లల రచనలకు ప్రాధాన్యత ఉంటుంది. ఈ పుస్తకంలో దాదాపు సగం కథలు పిల్లలు రాసినవి; మిగిలినవి పిల్లలకోసం పెద్దలు రాసినవి. బొమ్మలు వేసిన వాళ్ళు మటుకు యువకులు. పిల్లలను కలవటం, వాళ్లతో తెలుగులో కథలు రాయించటం, బొమ్మలు వేయించటం, వాళ్ళు పంపిన కథల్ని, బొమ్మల్ని సరిదిద్ది మిగతా పిల్లలందరికీ నచ్చేట్లు పుస్తకాలుగా తయారు చేయటం, దానికోసం ఓపెన్ సోర్సు ఉపకరణాలను వాడటం, కథల్ని అందరూ ఉచితంగా చదువుకునేట్లు ఇంటర్నెట్‌లో పెట్టటంతోపాటు, కొన్ని ప్రతులు అచ్చు వేయటం మాకు ఇష్టం. అందరి మేలూ కోరి చేసే ఈ పనిలో మీరూ పాలుపంచుకోండి. పిల్లల కథల ప్రపంచానికి స్వాగతం !

జ్యోతిష్కుడు (కోపంగా) : జాతకం చెప్పించుకొని డబ్బులివ్వకుండా వెళ్లిపోతున్నారేం?

అప్పారావు (ముసి ముసిగా నవ్వుతూ) : నేను పిల్లికి కూడా బిచ్చం పెట్టనని ఇందాక మీరే కదండీ చెప్పారు! ఇంకా నా నుండి డబ్బులు ఆశిస్తారేం?!

జ్యోతిష్యుడు (తనుకూడా నవ్వుతూ, ప్రక్కనున్న కుక్కను నిమురుతూ) : అందుకనే నాయనా, నిన్ను ఇవాళ్ళ కుక్క కరుస్తుందని ముందుగా చెప్పనిది!



# కుందేలు తెలివి

బొమ్మల కథ

*రచన: కె. వరమ్మ, ఏడవ తరగతి, తెలంగాణ సాంఘిక సంక్షేమ గురుకుల పాఠశాల, రంజోలు, మెదక్*



అనగనగా ఒక అడవిలో జింక, కుందేలు, కాకి, తాబేలు, ఆవు, ఏనుగు, ఎలుగుబంటి, ఇలా చాలా జంతువులు నివసించేవి. ఇలా ఎన్నో జంతువులు ఒకరికి ఒకరు సహాయం చేసుకుంటూ ఏ బాధ లేకుండా ఉండేవి.

ఆ అడవిలో మరో మూలన ఒక సింహం ఉండేది. దాని పేరు సింగ్ మహరాజ్. ఓసారి అది మిగిలిన జంతువుల దగ్గరికి వచ్చింది. "నేను కూడా మీతో స్నేహం చేస్తాను" అన్నది.

"మీరంతా ఏమంటారు?" అందరినీ అడిగింది ఏనుగు. "నువ్వు మమ్మల్ని చంపేయవు కదా, మాతో మంచిగా స్నేహం చేస్తావు కదా?" అని సింహాన్ని అడిగాయి మిగిలిన జంతువులు.

"అయ్యో! నేను మీ స్నేహం కోసమే వచ్చాను. మిమ్మల్నెందుకు చంపుతాను?" అన్నది సింహం.

"అట్లా అయితే సరే" అని అందరూ ఒప్పుకున్నారు.



కానీ సింగ్ మహరాజ్ చాలా మోసపుది. అది అడవిలోనే ఒక పాడుబడ్డ ఇల్లును వెతుక్కున్నది. రోజుకు ఒక జంతువును రహస్యంగా మాయమాటలు చెప్పి అందులోకి తీసుకుపోయి, తినేయటం మొదలు పెట్టింది.

దాంతో త్వరలోనే జంతువులన్నీ తగ్గిపోసాగాయి. జంతువులన్నీ ఒక రోజున మర్రి చెట్టు క్రింద సమావేశం పెట్టుకున్నాయి: "మన అడవిలోకి వేటగాళ్ళు ఎవ్వరూ

కూడా రాలేదే?! మరి రోజురోజుకూ జంతువులు ఎలా తగ్గిపోతున్నాయి? ఎలుగుబంటి కూడా కనిపించట్లేదెందుకు?" అని అన్నీ బాధ పడ్డాయి. సింహం కూడా వాటితోబాటు కూర్చొని అంతా విన్నది, కానీ ఏమీ అనలేదు. కానీ కుందేలుకు మటుకు సింహం మీద అనుమానం వచ్చింది.



"దీన్ని కొంచెం గమనించు" అని అది కోతికి చెప్పింది. కోతి చెట్టుమీద కూర్చొని సింహాన్ని గమనించటం మొదలు పెట్టింది. సింహం ఆరోజున ఒక జింకను తీసుకొని పాడుబడిన ఇంట్లోకి వెళ్ళగానే కోతి అక్కడే నిలబడి గంతులు వేసింది; కిచ, కిచ మని ఒర్రింది. దగ్గర్లోనే ఉన్న కుందేలు కిటికీలోంచి లోనికి చూసి జరుగుతున్న మోసాన్ని కనుక్కున్నది. వెంటనే అవి రెండూ మిగిలిన జంతువులకు విషయం తెలియజేసాయి.

ఆరోజు సాయంత్రం పదిమందీ ఉండగా కుందేలు పరుగు పరుగున సింహం దగ్గరికి వెళ్ళింది. "సింగ్ మహరాజ్! మనల్ని ఎవరు చంపుతున్నారో కనుక్కున్నాను. మనల్ని మీరే కాపాడాలి! రండి! ఇక్కడో దొంగ సింహం ఉంది-



అది రోజూ మనవాళ్ళని చంపి తింటున్నది! మీరు దాన్ని క్షణంలో చంపెయ్యండి!" అని సింహాన్ని, మిగిలిన జంతువుల్ని కూడా ఒక బావి దగ్గరికి తీసుకెళ్ళింది.

బావి లోకి చూసిన సింహానికి తన ప్రతిబింబమే కనిపించింది. "ఆగు! ఇప్పుడు నిన్ను చంపేస్తాను!" అని అది ఆవేశంతో బావిలోకి దూకింది. వెంటనే జంతువులన్నీ పైనుండి రాళ్ళు రప్పలూ విసిరి బావిలోనే దాన్ని తుదముట్టించాయి. జంతువులకు మోసకారి పీడ వదిలిపోయింది.

నవ్వు!

వెంగళప్ప మిత్రుడు: ఒరే! మొన్న ఈ మధ్య నువ్వేదో చిలకని తెచ్చావటగా, పెంచుకునేందుకు? అది ఎలా ఉంది, ఇప్పుడు!

వెంగళప్ప: ఇప్పుడు బానే ఉంది. కానీ మొన్న ఐతే అది నీళ్లు అనుకొని పెట్రోల్ తాగేసింది!

వెంగళప్ప మిత్రుడు: అయ్యో! మరి అప్పుడు ఏం చేసింది!?

వెంగళప్ప: ఏం చేసిందా?! ఇల్లంతా చెడతిరిగింది; కిటికీలోంచి బయటికి పోయింది; ఇంటి అద్దాలు పగలకొట్టింది; వంట సామాన్లు అన్నీ తోసేసింది; ఫ్యానుకు రెక్కలు కొట్టుకున్నది....

వెంగళప్ప మిత్రుడు: అయ్యో! చివరికి ఎలా ఆగింది?!

వెంగళప్ప: ఏముంది?! పెట్రోలు అయిపోయి ఉంటుంది!



# పెద్దల మాట

*సేకరణ : జి. వైష్ణవి, ఎనిమిదవ తరగతి, శ్రీ చైతన్య స్కూల్, కావలి.*

దట్టమైన ఓ అడవి అంచున, శ్రీపురం అనే ఊరొకటి ఉండేది.

అడవి మధ్యలో పెద్ద రావిచెట్టు ఒకటి ఉండేది. దాని క్రింద హరితానందుడనే సాధువు ఒకాయన ఉండేవాడు. ఊళ్లో ఏ సమస్య వచ్చినా జనాలు ఆయన్ని సలహా అడిగేవాళ్ళు. ఆయన కూడా బాగా ఆలోచించి, వివేకంతో కూడిన సలహాలు ఇస్తుండేవాడు.

శ్రీపురంలో రవి, రాజు అనే ఇద్దరు అల్లరి పిల్లలు ఉండేవారు. ఒకరోజు వీళ్ళిద్దరూ ఎవ్వరికీ తెలియకుండా అడవిలోకి బయలుదేరారు. అక్కడ ధ్యానంలో ఉన్న హరితానందను చూసి, ఆయనను అనుకరిస్తూ, ఎగతాళి చేయటం ప్రారంభించారు.

హరితానంద ధ్యానం ఆపి, వాళ్లకేసి చూసి నవ్వుతూ "ఏంటి, మీరిద్దరే వచ్చారా,

అడవిలోకి?! అడవి క్రూర మృగాలకీ, విష కీటకాలకీ నిలయం కదా; ప్రకృతితో మమేకం చెందగల గిరిజనులు మాత్రమే అడవిలో తిరుగాడగలరు. అడవిలో ఎన్నో ఆపదలుంటాయి. ఇక్కడికి రాకూడదమ్మా పిల్లలు! వచ్చిన దారినే తిరిగి వెళ్లిపోండి, వెంటనే!" అని హెచ్చరించాడు.

ఆయన మాటలు లెక్క చేయలేదు పిల్లలిద్దరూ. "మీరు ఇక్కడే ఉన్నారు కదా, మీకేమీ కాలేదు కదా, మాకూ ఏం కాదు- మాకు కూడా ప్రకృతి అంటే ఏంటో తెలుసు!" మొండిగా అంటూ వాళ్ళిద్దరూ సైకిళ్లెక్కి, ఇంకా అడవి లోలోపలికే దారి తీసుకుంటూ పోయారు.

క్రమంగా సూర్యుడు అస్తమించసాగాడు. రవి, రాజులు వెనక్కి తిరుగుదామనుకునే సరికే చీకట్లు క్రమ్ముకున్నాయి. వచ్చిన దారి తప్పారు ఇద్దరూ. అడవి బయటికి వస్తున్నామనుకుంటూనే మరింత లోపలికి వెళ్ళారు. ఇప్పుడిక వారికి భయం వేయటం మొదలు పెట్టింది.

చీకట్లు ముదిరినై. అంతలో పురాతనమైన గుడి ఒకటి, నల్లగా కనబడింది వాళ్లముందు. “ఇక్కడ ఎవ్వరూ ఉండరు! మనం చిక్కుపడిపోయాం, చీకట్లో!” అని ఏడుపొచ్చింది వాళ్లకి.

అంతలోనే గుడి లోపలినుండి సన్నగా దీపపు కాంతి కానవచ్చింది. “వావ్! ఇక్కడ ఎవరో ఉన్నారు! మనం ఈ రాత్రికి ఇక్కడ ఆగచ్చు!” అన్నాడు రవి ఆశగా. మెల్లగా ఇద్దరూ గుడి దగ్గరికి వెళ్ళి, తలుపును మెల్లగా నెట్టారు.

ఐతే ఆ గుడికి అసలు మామూలు మనుషులు ఎవ్వరూ రారు! నలుగురు అడవి దొంగలకు అది స్థావరం! తలుపులు తెరుచుకోగానే దొంగలు అటు తిరిగి చూసి, తటాలున లేచి వాళ్ల వెంట పడ్డారు.

పిల్లలు పిక్కల సత్తువ కొద్దీ పరుగు అందుకున్నారు. అంతలోనే వాళ్ల దారికి ఓ పెద్ద కొండ చిలువ అడ్డొచ్చింది! ఇద్దరూ కెవ్వున కేక పెట్టి, శిలా విగ్రహాల లాగా నిలబడిపోయారు- గట్టిగా కళ్లు మూసుకొని.

అంతలో ఎవరో వాళ్ళిద్దరి చేతులూ పట్టుకొని పక్కకి లాగినట్టనిపించింది. కళ్ళు తెరచి చూస్తే అక్కడ హరితానందుడు!



'పో! వీళ్ళు నీ ఆహారం కారు!' అన్నాడు సాధువు, కొండచిలువతో. దానికేం అర్థమైందో మరి, అది నెమ్మదిగా వెనక్కి తిరిగి అడవిలోకి వెళ్ళిపోయింది. అంతలోనే అటుగా వచ్చిన దొంగలు కూడా ఆయనకు నమస్కరించి, మారు మాట్లాడకుండా వెళ్ళిపోయారు.

రవి, రాజు ఆశ్చర్య చకితులయ్యారు- "స్వామీ! కొండ చిలువలు, దొంగలు మీ మాటనెలా విన్నారు?!" అని అడిగారు.

హరితానందుడు చిన్నగా నవ్వాడు. " ఏం లేదు బాబులూ! పాము నా మాట వినాలనుకున్నది; విన్నది. దొంగలూ అంతే- నా మాట వినాలనుకున్నారు, విన్నారు. కానీ మీరు వాళ్లకంటే ఎక్కువ తెలివిగలవాళ్ళు- నా మాట వినదల్చుకోలేదు; వినలేదు; ఆపదలో పడ్డారు. ఒక్కోసారి ఇతరుల మాటను మన్నించటం మేలు చేస్తుంది" అన్నాడు ప్రశాంతంగా.

రవి రాజు సిగ్గుతో తల దించుకున్నారు.

అటు తర్వాత వాళ్ళు పెద్దల మాటల్లో ఏమాత్రం మంచి విషయాలున్నా వాటిని గ్రహించి ఆచరించటం అలవాటు చేసుకున్నారు.

పెద్దల మాట- చద్ది మూట!



# మంచినీళ్ల విలువ

*డి. గౌతమ్, ఐదు-B, రఘునాథ మాడల్ హై స్కూల్, చైతన్యపురి, హైదరాబాదు.*

రోహన్, ప్రీతి అన్నా చెల్లెళ్లు. వాళ్ల నాన్న పేరు ప్రకాశ్. ఒకరోజున వాళ్లు పుస్తకాలు కొనుక్కోవడానికి వెళ్తుంటే, దారిలో కొంత మంది మంచి నీళ్లలో చెత్త వేస్తూ కనిపించారు. మంచి నీళ్ళలోకి రాళ్ళు, మట్టి వేస్తూ కేరింతలు కొడుతున్నారు వాళ్ళు.

అప్పుడు రోహన్ అడిగాడు- "నాన్నా! ఎందుకు నాన్నా, వీళ్ళు అట్లా చేస్తున్నారు?" అని.

"ఆడుకుంటున్నారు బాబూ!" చెప్పాడు నాన్న.

"కానీ నువ్వు నన్ను నీళ్ళు పాడు

చెయ్యద్దంటావు కదా, మరి వీళ్లు ఎందుకు పాడు చేస్తున్నారు? ఇట్లా చెత్త వేస్తే నీళ్ళు పాడైపోతాయి కదా?" అన్నాడు రోహన్.

"వీళ్లకి మంచి నీళ్ల విలువ తెలియదు బాబూ!" అన్నాడు నాన్న.

"మరైతే మనం వాళ్ళకి తెలిసేట్లు చెయ్యాలి కదా?" అన్నది ప్రీతి.

"సరే- చెప్పి చూద్దాం" అని నాన్న ఆ పిల్లల దగ్గరికి వెళ్ళి- "ఏయ్! పిల్లలూ, మీరు ఎన్నో క్లాసురా?!" అన్నాడు గట్టి గొంతుతో.

వాళ్ళు ఇటుకేసి చూసి చటుక్కున చేతులు కట్టుకొని " ఎందో తరగతి సార్" అన్నారు.

"ఎనిమిదో తరగతికి వచ్చారు- ఇట్లానారా, ఉండేది?!" అన్నాడు నాన్న.

వాళ్ళు సిగ్గుతో తలవంచుకున్నారు.

"ఇదిగో, చూడండిరా! మంచి నీళ్లు కిందకి ఎలా వస్తాయి? వర్షం ద్వారానే కదా? కానీ ఇప్పుడు చూడండి, మూడేళ్లుగా సరైన వర్షాలు పడక, చెరువులన్నీ ఎండిపోయాయి; బోర్లలో నీళ్ళు లేకుండా అవుతున్నాయి. నేలలోనూ నీళ్లు లేక; వర్షాలూ లేకపోతే ఇక పంటలు ఎట్లా పండుతాయిరా? మనం అందరం ఎట్లా బ్రతుకుతాం? ఉన్న కాసిని నీళ్లనీ పొదుపుగా వాడుకోవాలిగానీ, ఇట్లా వృధా చేసుకుంటే ఎలాగ?" అన్నాడు నాన్న.

"తప్పయింది సార్! ఇంకెప్పుడూ ఇలా చేయం" అన్నారు పిల్లలు.

కొన్ని చీమలు సైకిల్ రేసులో పాల్గొన్నాయి. వాటికి ఒక ఏనుగు అడ్డు వచ్చింది. అందులో ఒక చీమ 'చావడానికి నా సైకిలే దొరికిందా?' అని తిట్టింది ఏనుగుని.






# నాలుగు బొమ్మల కథలు

*మీకూ ఉంటైగా, బొమ్మలు ?! వాటి గురించి రాయాలని అనిపించలేదా, ఎప్పుడూ ?! రిషివ్యాలీ పిల్లలు వాళ్లకి ఇష్టమైన బొమ్మల గురించి రాస్తున్నారు- చూడండి. వీటిలో కొన్ని పదాల తప్పులున్నైచూసారా? వాటిని మీరే దిద్దుకొని చదువుకోవాలి !*

*రచన: ఋత్విక్, శ్రీ చరణ్, వర్షిణి, శ్రీజ -రిషీవ్యాలీ స్కూల్, మదన పల్లి, చిత్తూరు జిల్లా.*

## నా టోనీ!

నా గుర్రం పేరు టోనీ. నేను **దానితో** సెలవులలో దానితో ఆడుకుంటాను. అది చాలా దృఢమైన**ది** గుర్రం. అది బ్రౌన్ రంగులో ఉంది. దాన్ని నేను నా **కబోర్డ్‌లో** పెట్టుకుంటాను. నేను దానితో మంచం పైన ఆడుకుంటాను. దానితో నేను స్వారీ చేస్తాను. దాన్ని **దౌడ్** తీయిస్తాను. దానికి మెరిసే జుట్టుంది. వీపు పైన జీను ఉంది. **నాకంటే** అది చాలా ఇష్టం. అది మూడు వందల రూపాయలు. ఆ గుర్రాన్ని మా అవ్వ కొనింది. **అది** మా అవ్వ దాన్ని కడపలో

కొనింది. మా స్నేహితులకు నా బొమ్మంటే చాలా ఇష్టం. నేను దానితో మూడేళ్ళనుంచి ఆడుకుంటున్నాను.



నేను ఒకసారి నేను నా గుర్రాన్ని మా కిటి**కి** పైన వేసాను. నన్ను మా అమ్మ తిట్టింది. **అపుడి** నుంచి **ఇప్పుడి వరుకు** దాన్ని విలువైన బంగారం**లో** చూసుకుంటున్నాను. దానితో నేను ఇప్పుడు ఆడుకుంటున్నాను. అది చాలా దృఢమైన గుర్రం. నేను **పెద** వాడిని అయితే నేను ఈ గుర్రాన్ని కానుకగా నా పిల్లలకు ఇస్తాను. నాకు నా గుర్రం చాలా ఇష్టం. దానికి **పొడువైన** తోక ఉంది. అదే నా **ఫేవరెట్** బొమ్మ.

*-రిత్విక్*

## నా పులి బొమ్మలు!



నా పులులు చాలా దృఢంగా, అందంగా ఉంటాయి. మా అమ్మ ఆ రెండు **పులిల్ని** నా పుట్టినరోజు కానుకగా **ఇచ్చారు**. ప్రతీ రాత్రి నేను వాటితో పడుకుంటాను. నా బొమ్మల పేర్లు రిక్కి, నిక్కి. రిక్కి ఏ**మొ** తెలుగు రంగులో ఉంటుంది. ఇంకా నిక్కి ఏ**మొ బ్రౌన్** రంగులో ఉంటుంది. నాకు నా బొమ్మలు **నాకు** అంటే చాలా ఇష్టం. నేను నా బొమ్మలతో చాలా అల్లరి చేస్తాను. నా బొమ్మ అంటే నా **అందరి** స్నేహితులకు ఇష్టం. నా **పులిల్కి** చాలా **జూటు**, చిన్న

కళ్లు, అందమైన నల్ల గీతలు ఉంటాయి.




ఆ గీతలు నా **ఉలికే అందానిస్తుంది**. కొన్ని కొన్ని సార్లు ఆ **పులిలు** నిజమైన **పుల్లుల** కనిపిస్తాయి. దాని **కళ్ళుని** చూస్తే నాకు ఎంతో సంతోషంగా ఉంటుంది. ఆ రెండు **పులిలు** ఐదు వందల **రుపాయలు** విలువ **చేసింది**. **అవిటి** చెవులు చూస్తే నాకు పెద్ద పెద్ద శంఖాలు **గుర్తుకొసాయి**. దాని తోక చూస్తే, **సెరీరం** చూస్తే నాకు పిల్లి **సెరీరం** గుర్తుకొస్తుంది. దాని మీసాలు **చూసే,** నాకు దృఢంగా ఉన్న సింహం **గుర్తుకోస్తుంది**. నేను **పెద్దైనాకా** కూడా **అవిటిని** నేను భద్రంగా దాచి పెట్టుకుంటాను. నాకు నా బొమ్మలు అంటే ప్రాణం.

*-శ్రీ చరణ్*

## నా మేక!




నా దగ్గర చాలా బొమ్మలు ఉన్నాయి. కాని నాకు ఒక బొమ్మ అంటే చాలా ఇష్టం. ఆ బొమ్మ ఒక మేక పిల్ల. అది తెల్లగా ఉంటుంది. దానికి **ఫ్లాపీ చవులు** ఉన్నాయి. **దానిని** నా పుట్టిన రోజు ఆ బొమ్మని కొనిచ్చా**డు**. ఆ బొమ్మ అంటే నాకు చాలా ఇష్టం. ఆ బొమ్మకి మెరిసే కళ్లు ఉన్నాయి. **దానితో** నేను నా **చెల్లలు** దానితో ఆడుకుంటాము. ఎలాంటి ఆటలంటే దాన్ని మేము **పెంచుకుంనట్లూ**, ఇంకా చాలా ఆటలు ఆడుకుంటాము. ఇంకా దౌడు తీయించినట్లు. దాన్ని నేను వాకింగ్‌కి పిలుచుకొని

**దాన్ని** వెళ్తాను. నేను **దాన్ని** చిన్నగా **ఉన్నప్పుడు** దాన్ని 'తిత్తిల్ లాంబ్' అనే దాన్ని. **ఎమనాలనుకున్నాంటే** 'లిట్టిల్ లాంబ్' **అనాంలనుకున్నాను!!** నా **చెల్లలకు** కూడా అది అంటే చాలా ఇష్టం. **అది** నాన్న దాన్ని హైద్రాబాద్ నుండి తెచ్చారు. అది ఎంతో మెత్తమెత్తగా ఉంటుందో. నేను అప్పుడప్పుడు దాన్ని **గెట్టిగా** పట్టుకొని **నిదరుపోతాను**. దాని పేరు లిట్టిల్ లాంబ్. నేను చెప్పినట్టే దాన్ని నేను చిన్నగ ఉన్నపుడు తిత్తిల్ లాంబ్ అనే దాన్ని. నా బొమ్మ అంటే అందరికీ **ఇష్టంమే**. ఆ బొమ్మ నాకు ఎంతో ఇష్టం. నేను **పెద్దైయాకా** కూడా ఉంచుకుంటాను. దాన్ని నేను జాగ్రత్తగా చూసుకుంటాను. అది చాలా ముద్దుగా ఉంటుంది. అది ఎప్పటికి **ఇష్టంమే**.

*-వర్షిణి*

## నా పాప బొమ్మ!




నాకు ఒక బొమ్మ ఉంది. **దని** పేరు టెస్సీ. అది ఎరుపులో ఉంది. దాని జుట్టు పసుపు రంగు. **అది** అనంతపురంలో కొనుకున్నాను. **అది** 200 అయింది. అది కొంచెం తెలుపులో ఉంది. అది లావుగా ఉంది. అది మెత్త మెత్తగా ఉంది. **అది** నేను రవికి తెచ్చాను. దానితో నేను పడుకుంటాను. దాని కళ్లు నలుపులో ఉం**ది**. నేను దానికి **భటలు వెస్తాను**. దానికి ఒక **బ్లైటు వేసను**. నేను దాని **తొరొగు** పడుకుంటాను. దానికి ఒక **చినా** తోక- దానికి ఒక జిప్ ఉంది. అది చాలా **ముదుగా** ఉంటుంది. నేను దాని చాలా **జగ్రతగ చుసుకుంటాను**. **దనికి** కళ్ళు **మేరుస్తాను**. అది చాలా అందంగా **ఉంది**.

*-శ్రీజ*



# పాముకు పాలు

*హైదరాబాదు పుస్తక ప్రదర్శనలో కూర్చొని సత్య రాసిన ఈ కథ చూడండి. మరి దుష్టుల్ని ఎవ్వరూ దగ్గరికి రానివ్వక పోతే వాళ్ళు ఎలా బాగుపడతారంటారు..?*



*ఎ. సత్య, ఏడవ తరగతి*, B *సెక్షన్*, S.F. Alogsius High School, *చైతన్యపురి, హైదరాబాదు.*

అనగనగా ఒక అడవిలో ఒక పాము ఉండేది. దానికి పళ్ళు ఒకటే ఉలఉల అనేవి. కనిపించిన జంతువునల్లా ఊరికే కొరుకుతుండేది. సింహరాజుకి ఈ సంగతి తెల్సి- 'ఇదిగో- నీకు ఇది చివరి అవకాశం. మర్యాదగా నీ అలవాటు మానుకో. లేకపోతే అంతే' అనేసింది.

పాము చిన్న ముఖం పెట్టుకొని ఏడుస్తూ పోతుంటే చెట్టు మీద ఉండే కోతి ఒకదానికి జాలి వేసింది. "ఎందుకు, ఏడుస్తున్నావ్ పామూ?" అని అడిగింది.

"సింహం నన్ను బెదిరిస్తోంది. 'చెప్పినమాట వినకపోతే అంతే' అంటోంది!" ఫిర్యాదు చేసింది పాము.



కోతికి కోపం వచ్చింది. "అట్లా ఎట్లా అంటుంది? వీల్లేదు. నువ్వు నా చెట్టు క్రింద ఉండు. నీకేమీ కాకుండా నేను చూస్తాను" అన్నది.

మరుసటి రోజు ఉదయాన్న కోతి ఆహారం కోసమని అడవిలోకి వెళ్ళగానే పాము పళ్ళు మళ్ళీ ఉలఉల మన్నాయి. దేన్ని కొరకాలా, అని చూస్తే దానికి మూడు కోతి పిల్లలు కనిపించాయి. వెంటనే అది చెట్టెక్కి కోతిపిల్లల్ని తనివితీరా కరిచి, ఏమీ ఎరుగని దానికి మల్లే చుట్ట చుట్టుకొని పడుకున్నది.

సాయంత్రం ఇంటికి తిరిగి వచ్చిన కోతికి నురగలు క్రక్కి చనిపోయిన పిల్లలు కనిపించేసరికి విపరీతమైన ఆవేశం వచ్చింది. " 'పాముకు పాలు పోయటం' అంటే ఇదే. దారినపోయే పామును ఊరికే నెత్తికెక్కించుకున్నాను" అని ఎంతో బాధ పడిన కోతి, బండరాయిని ఒకదాన్ని తెచ్చి పాము మీద పడేసింది. అయినా కోపం ఆపుకోలేక దాన్ని తగలబెట్టేసింది!





# ఉడత కథలు

*కొత్తపల్లి-84 లో "కథ రాయండి" అని ఇచ్చిన ఉడత బొమ్మకు కుంచనపల్లి-మంగళగిరి అరవింద మోడల్ స్కూల్లో ఎనిమిదో తరగతి చదివే పిల్లలు కనిపెట్టిన ఏడు కథలు...* :)



## వేటగాడి ఉపాయం

“ఇదుగో పాపలూ! కొత్త కొత్త వస్తువుల్నిగానీ, మనుషుల్ని గానీ నమ్మి దగ్గరికి పోకండి!” అని పిల్లలందరికీ చాలాసార్లే చెబుతుండేది తల్లి ఉడత. ఉడత పిల్లలన్నీ చక్కగా తలలూపేవి. అయితే వాటిలో చిన్న పిల్లకు మటుకు అమ్మ మాటలు నచ్చలేదు. “ఎందుకట?! ఊరికే భయపడేది ఎందుకు?! నేను కొత్త వస్తువుల్ని ఎంచక్కా ముట్టుకుంటాను. నాకేమీ కాదు" అనుకునేది.

ఆ ప్రాంతంలోనే ఓ వేటగాడు ఉండేవాడు. అతనికి ఉడతల్ని పట్టుకోవటం అంటే చాలా ఇష్టం..

అతను వాటిని తినేవాడు; లేకపోతే అమ్ముకునేవాడు.




అయితే ఓసారి చలి కాలంలో బాగా మంచు పడింది. ఉడతలు అస్సలు బయటికి రాలేదు. వేటగాడికి చాలా కష్టమైంది. వాటిని బయటికి రప్పించటంకోసం వాడు ఒక ఉపాయం ఆలోచించాడు. మంచుతో చక్కని బొమ్మలాగా చేసాడు. ఆ బొమ్మకి ఒక క్యారెట్ ముక్క పెట్టాడు. తను ఆ ప్రక్కనే ఓ చెట్టు మాటున నక్కాడు.

కొద్దిసేపటికి క్యారట్ వాసన తగిలి చిన్న ఉడత బయటికి వచ్చింది. అక్కడ దానికి ఓ చక్కని మంచుమనిషి కనిపించాడు! దాన్ని చూడగానే ఉడతకు చాలా సంతోషం వేసింది. "అబ్బ!ఏమిటబ్బా ఇది, బలే ఉంది! అని, మంచు మనిషి దగ్గరకు వెళ్లి, దాని ముక్కుకున్న క్యారెట్టును పట్టుకొని తినబోయింది.

సరిగ్గా అదే సమయంలో వేటగాడు వల విసిరి పట్టుకున్నాడు దాన్ని, "దొరికావు! ఇప్పుడు నిన్ను ఎట్లా తింటానో చూద్దువు!" అని వాడు దాన్ని ఒంటి చేత్తో గట్టిగా పట్టుకొని, వలనుండి తప్పించాడు. అంతలో వాడి సెల్‌ఫోను గణగణా మ్రోగటం, వాడు ఉడతమీద పట్టును సడలించి సెల్‌ఫోను తియ్యటం; ఉడత వాడి వేలును గట్టిగా కొరికి క్రిందికి జారి పరుగెత్తటం- అన్నీ కనురెప్ప పాటులో జరిగిపోయాయి!

అయితే ఈ దెబ్బతో ఉడత పిల్లకు జ్ఞానోదయం అయింది. కొత్తగా, వింతగా ఉన్న వస్తువుల జోలికి వెళ్లకూడదని దానికి అర్థమైంది! *-కె.సాత్విక.*



# ఉడతకు సాయం చేసిన మంచు బొమ్మ



అనగనగా ఒక ఊళ్లో ఒక ఉడత ఉండేది. ఆకలి వేసినప్పుడు తినేందుకని అది దాని ఇంటిలో ఎక్కడో కొంత ఆహారాన్ని భద్రంగా నిలవ ఉంచుకున్నది.

ఒకరోజు నిద్ర నుంచి లేవగానే పాపం దానికి బాగా ఆకలి వేసింది. కానీ తను ఆ ఆహారాన్ని ఎక్కడ దాచిపెట్టిందో మరచిపోయిందది! ఎంత గుర్తు తెచ్చుకుందామన్నా గుర్తు రాలేదు! బాగా వెతికి-వెతికి- గంటలతరబడి వెతికాక, దానికి తను ఆహారం దాచిన చోటు దొరికింది- కానీ తీరా అది కూర్చొని ఆహారం చేత పట్టుకునే సరికి ఎలుక ఒకటి వచ్చిపడింది. ఉడత ముందున్న ఆహారాన్ని మొత్తం చటుక్కున ఎత్తుకొని పారిపోయింది!

ఉడత ఎలుకను వెంబడిస్తూ ఇంటి బయటికి వచ్చి, అటు-ఇటు చూసింది: ఎక్కడా ఎవ్వరూ లేరు! ఎలుక జాడ లేనే లేదు!

'ఇలా కుదరదు' అని అది ఎలుకని వెతుక్కుంటూ పోయింది. అంతలో దానికి ఒక స్నోమాన్ కనబడింది. "ఏంటిది అబ్బా?" అని చూసింది; కానీ ఆకలిని తట్టుకోలేకపోయింది పాపం.

చివరికి అది స్నోమాన్ కళ్ల వైపు చూసి, "నన్ను క్షమించు స్నోమాన్, నేను ఆకలికి తట్టుకోలేక పోతున్నాను. నీ క్యారట్ తింటున్నాను. నన్ను క్షమించు" అంటూ స్నోమాన్ ముక్కుకు పెట్టిన క్యారెట్‌ని తినేసింది.

అట్లా తన ఆకలి తీరాక, అది స్నోమాన్‌కేసి చూసి "ధన్యవాదాలు స్నోమాన్! నీకు ఎప్పుడైనా ఆకలి వేస్తే నేను నీ ఆకలిని తీర్చుతాను- సరేనా?" అని మాట ఇచ్చి మరీ దాన్ని బుజ్జగించి పోయింది.



-*పి.మందిర*

## ఉడత కథ

అది ఒక వర్షం కురుస్తున్న రాత్రి. యజమాని ఒకడు ఓ ఉడతల గుంపుని బోనులో పట్టుకొని, తను ఓ గొడుగు వేసుకొని, వర్షంలో చక చక పరిగెత్తాడు. ఆ సమయంలో బోనులో నుంచి ఓ ఉడత జారి క్రింద పడింది. యజమాని ఆ సంగతి గమనించలేదు- వెళ్లిపోయాడు.



కొద్ది సేపటికి తేరుకున్న ఉడత అటు-ఇటు చూసి గట్టిగా అరిచింది. ఎవ్వరూ బదులివ్వలేదు. దానికి బాగా చలి వేసింది. ఎందుకంటే అది గొప్ప మంచు ప్రదేశం కూడా. ఉడత మెల్లగా పాక్కుంటూ దగ్గర్లో కనిపించిన ఓ చెట్టు ఎక్కి, ముడుచుకొని పడుకున్నది.

తెల్లవారి నిద్ర లేచేసరికి దానికి చాలా బాధ వేసింది. మిత్రులు తనని వదిలేసారని బాగా ఏడ్చింది, తర్వాత ఇంకా కొంతసేపు ఏడ్చింది. అటుపైన ఆహారం వెతుక్కుంటూ ప్రయాణం

సాగించింది. దొరికిన ఆహారం ఏదో తిన్నాక, ఇక అది జరిగిన దాన్నంతా మరచి, ఆ మంచులో ఆడటం మొదలుపెట్టింది.

దాని ఆట కారణంగా మంచు దొర్లింది. దొర్లిన మంచు గుండ్రంగా, ఓ పెద్ద బంతిలా అయ్యింది. ఉడతకు అది చాలా నచ్చింది. దాన్ని అటూ-ఇటూ దొర్లించింది. దొర్లించిన కొద్దీ అది మరింత పెద్దదైంది. చూసి చూసి ఉడత ఒక్కసారిగా చటుక్కున ఎగిరి దాని మీద కూర్చుంది. రాజుగారిలాగా ఎత్తులో కూర్చోవాలనిపించింది దానికి. ఇంతకు ముందులాగే మరో ఉండను చేసింది. ఎత్తేందుకు వీలుగా దీన్ని కొంచెం చిన్నగా చేసి, అట్లా ఉండగానే దాన్ని ఎత్తి పెద్ద ఉండ మీద పెట్టింది. ఇంకా ఎత్తు చాలలేదు. మరో ఉండని దాని మీదికి ఎక్కించింది. ఇప్పుడు రాజాలాగా మూడు ఉండల మీదికెక్కి కూర్చుంది.

అంతలో ఓ కాకి- క్యారట్లు తీసుకెళ్తూ ఒక క్యారట్టును జారవిడిచింది. ఆ క్యారెట్‌ని అందుకునేందుకు ఉడత గభాలున దూకింది. గంతులేస్తూ దాన్ని అందుకున్నది. ఆ కంగారుతో మళ్ళీ పైకి ఎక్కుతూ జర్రున జారింది. అది పట్టుకున్న క్యారెట్ మంచు బంతికి గుచ్చుకున్నది.

ఉడత కిందకి దిగి దాన్ని తీసుకోబోయింది- అయితే క్యారట్టుతో కూడిన ఆ మంచు బంతులు ఇప్పుడు ఓ మంచు మనిషి లాగా కనిపించాయి దానికి! 'బలే ఉంది!' అని క్యారట్ క్రింద పడకుండా మరింత లోపలికి తోసి సరి చేసిందది.

చలికాలం అంతా ఇక ఆ మంచుమనిషితో ఆటలే, దానికి!



*-కె. గోపి కేశవ్, ఎనిమిదవ తరగతి.*

**అంతా వృధా!**

టీచర్: చెట్టు కింద కూర్చొని గురుత్వాకర్షణ శక్తిని కనిపెట్టాడు న్యూటన్. దీనిని బట్టి నీకేం అర్థం అవుతున్నది?

కిరణ్: ఇలా మనలాగా క్లాసులో కూర్చుంటే కొత్త విషయాలు కనిపెట్టలేమని తెలిసింది టీచర్!

# ఉడత ఊహ



అనగనగా ఒక ఉడత, తన తల్లి ఉండేవారు. వాళ్ల తండ్రి, మిగతా కుటుంబ సభ్యులందరూ ఏనుగుల సమూహం కింద పడి చనిపోయారు.

ఒకసారి అది తన తల్లి తన కోసం ఏదైనా తీసుకురావడానికి వెళ్లింది. కానీ దారి తప్పి పోయింది. ఇంటికి తిరిగి రాలేక పోయింది! అయినా అది వాళ్ల అమ్మ కోసం ఎక్కడపడితే అక్కడ వెతుకుతూ పోయింది. అట్లా చివరికి అది ఓ చల్లని ప్రదేశానికి చేరింది. అకస్మాత్తుగా దానికి అక్కడ ఒక మంచు మనిషి కనిపించింది. "మంచు మనిషికి ముక్కే లేదు పాపం" అని అది ఓ క్యారట్ తెచ్చి, దాన్ని కొరికి కొరికి ముక్కులాగా తయారు చేసింది.

ముక్కు పెట్టాక చూస్తే మంచు మనిషి చాలా ముద్దుగా అనిపించాడు. అది తన కష్టాల్ని మరచిపోయి ఆ దగ్గర్లోనే ఉన్న చెట్టు ఒకదాని మీద పడుకున్నది. మళ్ళీ కళ్ళు తెరిచి చూసే సరికి ఆశ్చర్యం! వాళ్ల అమ్మ దాని ఎదురుగా నిల్చొని ఉన్నది! ఇంతకీ దానికి వచ్చింది కలేనంటారా?



-జి. యామిని.

# స్వచ్ఛమైన స్నేహం

అనగనగా కుందేలు ఒకటి తనకు ఇష్టమైన క్యారెట్ నముల్తూ, నముల్తూ స్నేహితుల ఇంటికి బయలుదేరింది. అయితే సరిగ్గా అది బయలు దేరే సమయానికే దట్టంగా మంచు పడటం మొదలయింది. మంచులో దారి కనిపించక, కుందేలు ఒకవైపు పోవాల్సినది మరొక వైపుకు పోతూ పూర్తిగా దారి తప్పింది!




అట్లా పోయి పోయి, చివరికి ఆ కుందేలు ఒక పర్వతపు అంచుకు చేరుకున్నది. అక్కడినుండి అన్నిదిక్కులకూ కలయ జూచింది- కానీ ఎటు వెళ్ళాలో తెలీలేదు దానికి. 'ఛ' అనుకొని కుందేలు నిరాశతో క్రుంగి పోయింది. అక్కడే నేలమీద పడి స్పృహ తప్పింది!

కొద్ది సేపటికి కళ్ళు తెరిచి చూస్తే అది ఒక కొలను ప్రక్కన పడి ఉన్నది! దానికి చాలా దాహం కూడా వేయసాగింది! 'పక్కనే ఇంత చక్కని కొలను నిండా నీళ్ళుంటే, నేను ఎందుకు త్రాగట్లేదు?' అని అది కొలనులోకి దిగి గబగబా గ్రుక్కెడు నీళ్లు తాగింది.

మరుక్షణం అక్కడ ఒక మాంత్రికుడు ప్రత్యక్ష్యమయ్యాడు- వాడు కుందేలు కేసి కోపంగా చూసి "ఇదిగో! నేను మంత్రించిన ఈ నీళ్ళను నువ్వు అనుమతి లేకుండా తాగావెందుకు? నిన్ను శపిస్తున్నాను. నువ్వు తక్షణం ఈ పర్వతం మీద మంచుబొమ్మవై పో!" అన్నాడు.

కుందేలు వలవల ఏడుస్తూ "నన్ను క్షమించండి, చూసుకోలేదు!" అన్నది.

“ఊహుఁ.. నేను నిన్ను క్షమించలేను- కానీ దీనికి విముక్తి మాత్రం చెప్పగలను. నువ్వు తాగిన ఈ మంత్రజలపు మహిమవల్ల, నీ కోసం మనస్ఫూర్తిగా వెతికేవాళ్ళకు ఎవ్వరికైనా నువ్వెవరో తెలిసి పోతుంది! ఆ స్నేహితుడి స్పర్శవల్ల నీకు మళ్ళీ యథారూపం వచ్చేస్తుంది” అని చెప్పిమాంత్రికుడు చెప్పి అక్కడి నుండి వెళ్ళిపోయాడు. తక్షణం ఆ ప్రదేశమంతా మంచు ప్రదేశమైపోయింది!

అయితే కుందేలుకు ఒక స్నేహితుడుండేది. అది ఒక ఉడత. రెండు రోజుల క్రితం పోయిన స్నేహితుడు ఇంకా ఇంటికి రాలేదేమి?” అని అది కుందేలును వెతుక్కుంటూ బయలు దేరింది. పోగా పోగా దానికి మంచుకొండ ఎదురైంది. "ఇదేదో వింతగా ఉందే, మన దగ్గర మంచు కొండ ఏంటి?” అని అది ఇంకా ముందుకు పోయింది. అక్కడ మంచుబొమ్మ రూపంలో ఉన్నప్పటికీ కుందేలును గుర్తించగలిగిందది.

"ఏంటిది? ఇట్లా ఎందుకైనావు?" అని అడిగితే కుందేలు ఉలుకు-పలుకు లేదు. ఉడుత మంచుని అంతా తొలగించి, దాని ముఖాన్ని స్పృశించిందో లేదో, కుందేలుకు మళ్ళీ ప్రాణం వచ్చింది. “ఇంకెన్నడూ నావి కాని వస్తువుల్ని ముట్టుకోను!” అంటూ అది ఉడత చెయ్యి పట్టుకొని ఇంటివైపుకు పరుగు తీసింది!

-వి. దుర్గ



**ఒకరికి ఒకరు!**



ఇద్దరు కవలలు.. ఒకడు ఏడుస్తున్నాడు, ఇంకొకడు పడీ పడీ నవ్వుతున్నాడు.

వాళ్ల నాన్న: ”ఒరేయ్, వాడు ఏడుస్తుంటే, నువ్వెందుకురా నవ్వుతున్నావు?”

నవ్వుతున్నవాడు: "హా హా! ఇంత చలిలో మమ్మీ నేననుకొని వీడికి రెండోసారి స్నానం చేయించింది”

# ఉడత కుటుంబం



ఒక ఊళ్లో ఉడత కుటుంబం ఒకటి ఉండేది. అది ఉమ్మడి కుటుంబం.

ఒకరోజున పెద్ద వరదలు వచ్చాయి. ఉడత పిల్ల తన కుటుంబం నుండి విడివడి, వరద నీళ్లలో కొట్టుకుపోయింది. అది లేచి చూసేసరికి దిక్కులు తెలీలేదు. దానికి చాలా భయం వేసి, బిగ్గరగా ఏడ్చింది. అయినా అక్కడ ఎవరైనా ఉంటే గద, దాన్ని చూసేందుకు?

అట్లా కొంచెం సేపు ఏడ్చాక, అది లేచి మెల్లగా అడుగులోఅడుగులు వేసుకుంటూ ఓ చల్లటి కొండ ప్రదేశం చేరుకున్నది. అక్కడ అంతా హడావిడిగా, గందరగోళంగా ఉన్నది. ఉడత పిల్ల ఓ చెట్టు మీదికి ఎక్కి చూస్తూ కూర్చున్నది. పిల్లలు కొందరు ఓ మంచు మనిషిని చేసారు. దానికి ఓ క్యారెట్‌ను ముక్కుగాను, ఆవాలను కళ్లులాగాను పెట్టారు. అట్లా కాసేపు ఆడుకున్నాక, ఏదో గంట కొట్టినట్లు శబ్దమైంది. వెంటనే పిల్లలంతా బిలబిలా అక్కడినుండి వెళ్లిపోయారు! పైనుండి వాళ్ల కేరింతల్ని చూస్తూన్న ఉడతకు తన కుటుంబం గుర్తుకు వచ్చి చాలా

ఏడుపొచ్చింది.

వాళ్లంతా వెళ్ళాక, మెల్లగా అది మంచుమనిషిని చేరుకొని, దానికి పెట్టిన క్యారట్.ముక్కును తిన్నది. అంతలోనే దానికి ఒక ఐడియా వచ్చింది- నీళ్ళు ఎప్పుడూ క్రిందికే గద, పారేది? ఇప్పుడు తను కొట్టుకొచ్చిన వరద నీళ్ళు ఇంకా పైనుండి ఎక్కడినుండో వచ్చి ఉండాలి. తను ఇప్పుడు ఆ వరద జాడని పట్టుకొని పైకి పోతే?!

వెంటనే అది మంచుమనిషిని ముద్దు పెట్టుకొని, నీళ్ళు ఏ దిశనుండి వచ్చాయో అటు వైపుగా ప్రయాణం మొదలు పెట్టింది. ఎన్ని కష్టాలు ఎదురైనా ప్రయాణం కొనసాగిస్తూనే పోయింది. చివరికి, మూడు నాలుగు రోజులు రాత్రనక, పగలనక ప్రయాణించిన తర్వాత దానికి పరిచయం ఉన్న ప్రాంతం వచ్చింది. ఇంకేమున్నది, గబగబా ఇంట్లోకి దూరింది. పోయిందనుకున్న బిడ్డ తిరిగి వచ్చినందుకు ఉడత కుటుంబం మొత్తం సంతోషంగా నాట్యం చేసింది!



*-ఎ. అభినయ.*

## ఉడతల ప్రయాణం

మంచుతో కూడిన ఓ ప్రదేశంలో ఒక ఉడత ఉండేది. దానికి ఐదుగురు స్నేహితులు ఉన్నారు. అంత మంచులో కూడా అక్కడక్కడా చెట్లు ఉండేవి; దాంతో ఆ ఉడతలకు ఆహారం దొరికేది. అయితే చెట్లను మనుషులు కొట్టివేస్తూ ఉండేవారు. దాంతో రాను రాను ఉడతలకు ఆహారం దొరకటం కష్టమైంది. చివరికి ఒకరోజున అవి ఎంత వెతికినా వాటికి ఎలాంటి ఆహారమూ దొరకలేదు! అన్నీ పస్తులుండాల్సి వచ్చింది.

అట్లా కొద్ది రోజులు గడిచే సరికి ఆకలికి తట్టుకోలేక నాలుగు ఉడతలు ఒక్కసారిగా చనిపోయాయి. మిగిలిన రెండింటికీ చాలా కష్టం తోచింది. "ఇక ఇక్కడ ఉండకూడదు.

ఆహారం కోసం వెతుక్కుంటూ పోదాం. మనిద్దరికీ సరిపడేంత ఆహారం వేరే ఎక్కడైనా సులభంగా దొరుకుతుంది" అని అవి రెండూ తాము పుట్టిన ఊరిని వదిలి ప్రయాణం మొదలు పెట్టాయి.



అట్లా అవి మూడు రోజుల పాటు నడుస్తూ పోయాయి. రెండూ బాగా నీరసించి పోయాయి. వాటిలో ఒకటి ఇక నడవలేని స్థితికి చేరుకున్నది. "నువ్వు ఇక్కడే కూర్చో. నేను ఈ పరిసరాల్లో తినేందుకు ఏ కొంచెమైనా దొరుకుతుందేమో చూసి వస్తాను" అని దాన్ని ఒకచోట కూర్చోబెట్టి, వెతికేందుకు పోయింది చివరి ఉడత.

సెలవలను సంతోషంగా గడిపేందుకు అక్కడికి కొందరు పిల్లలు వచ్చి ఉన్నారు. అక్కడి మంచుతో వాళ్లు బొమ్మలు చేస్తున్నారు, ఆడుకుంటున్నారు. వాళ్ళు తిన్న చోట రకరకాల ఆహారపు ముక్కలు పడి ఉన్నాయి! ఉడతలు రెండింటికీ అవి చాలానే రోజులపాటు సరిపోతాయి!

ఉడతకు ప్రాణం లేచి వచ్చినట్లయింది. గబగబా తను తీసుకెళ్ళగలిగినన్ని ముక్కల్ని

తీసుకెళ్ళింది. తను తింటూ తోటి ఉడతకు పెట్టింది. మరుసటి రోజు తెల్లవారే సరికి రెండింటికీ శక్తి వచ్చింది. రెండూ మళ్ళీ అదే స్థలానికి బయలుదేరి పోయాయి.

ఇప్పుడక్కడ పిల్లలు లేరు. వాళ్లు మంచుతో చేసిన మంచుమనిషులు నిలబడి ఉన్నారు. వాటికి క్యారెట్ల ముక్కులు ఉన్నై! ఉడతలు తినేందుకు ఇప్పుడు క్యారెట్లు కూడా దొరికాయి. ఉడతలు ఆ క్యారట్లనీ, పిల్లలు వదిలేసిన తిండి ప్రార్థాలనీ అన్నిటినీ తీసుకొని, మళ్ళీ తమ ప్రయాణాన్ని మొదలు పెట్టాయి.

*-జి. పూజిత.*



## భూకంపం?!




అనగనగా ఒక ఉడత కుటుంబం ఉండేది. అప్పుడే కొత్తగా ఆ కుటుంబంలో ఒక ఉడత పిల్ల జన్మించింది. అంతలోనే అకస్మాత్తుగా వచ్చిన భూకంపంలో ఆ చిట్టి పిల్ల తప్ప కుటుంబం అంతా పోయింది. తోటి జంతువుల సహాయం వల్ల ఉడత పిల్ల మటుకు బ్రతికి, తన జీవితాన్ని కొనసాగించింది.

అది తోటి జంతువులు అన్నిటికీ సాయం చేస్తూ ఉండేది. కానీ దానికంటూ ఎవరూ స్నేహితులు ఉండేవాళ్ళు కారు. తనవాళ్ళు అంటూ ఎవరైనా ఉంటే బాగుండునని అది చాలా

అనుకునేది. ఆ ఉద్దేశంతోటే ఒకసారి అది అక్కడ ఒకమంచు మనిషిని తయారుచేసింది. దాంతో చాలా గాఢంగా స్నేహం చేసింది; తన గురించీ, తన కుటుంబం గురించీ, తను చూసిన సంతతుల గురించీ, తన ఆలోచనల గురించీ చెప్పింది. కానీ అది బొమ్మ కదా, మాట్లాడేది కాదు. ఉడతకు బదులిచ్చేది కాదు.

అట్లా చాలా రోజులు గడిచాక దానికి మరొక ఉడత కనిపించింది! ప్రాణం లేచి వచ్చినట్లయింది దానికి. దానితో స్నేహం చేసింది. దాని కుటుంబాన్ని తన కుటుంబంగా చేసుకున్నది. ఆ కుటుంబం మొత్తానికి సరిపడా ఆహారం సేకరించేది. క్రమంగా కుటుంబపు బాగోగులే కాక, తాము ఉండే ప్రదేశపు బాగోగులన్నీ చూసుకోసాగింది. దానికి బద్ధకం అంటే ఏమాత్రం ఇష్టముండేదికాదు. అందువల్ల త్వరలోనే జంతువులన్నీ కలిసి దాన్ని రాజును చేసాయి!



-కె.హర్షిత.

చొక్కారావు (కోపంగా) : సంవత్సరం తిరక్కుండానే ఒక ఇంటి వాడవుతావు...అని చెప్పావు- అది జరగలేదు- సరి కదా... మాకున్న రెండు ఇండ్లలో ఒక ఇంటిని అమ్ముకోవాల్సి వచ్చింది!
జ్యోతిష్కుడు (తాపీగా): నేను చెప్పిందీ అదే కదా!!



ఒకటో వెంగళప్ప (గుసగుసగా): దగ్గరికి రా, నేను ఒక మాట చెబుతా...ఈ ప్రపంచాన్ని చౌకగా అమ్మేయాలని అనుకుంటున్నా. కానీ ఈ విషయం ఎవరికీ చెప్పకు! విన్నారంటే జనాలంతా "నాకు అమ్ము, నాకు అమ్ము" అంటూ వెంటపడి నా ప్రాణాలు తోడేస్తారు!
రెండో వెంగళప్ప : ఎవరికీ చెప్పను గానీ, ఇప్పట్లో నాకు మటుకు కొనేందుకు డబ్బులు లేవు. ఇంకో సంవత్సరం ఆగితే ఆలోచించగలనేమో...



# సాహసవీరుడి కథ

*రిత్విక్, రిషీ వ్యాలీ స్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా.*

అనగనగా ఒక రాజ్యంలో ఒక రాజు ఉండేవాడు. ఆ రాజుకు ఇద్దరు కొడుకులు. వాళ్లు ఒక రోజున పెళ్లి చేసుకుందామని అనుకున్నారు. కానీ పెళ్ళి చేసుకునేందుకు ఒక్క అమ్మాయి కూడా దొరకలేదు!

దాంతో వాళ్లిద్దరూ వాళ్ళకు కావలసిన రాకుమార్తెల్ని వెతుక్కొని రావాలని నిశ్చయించుకున్నారు. మరుసటి రోజున ఇద్దరూ గుర్రాల మీద ఎక్కి అడవిమార్గం గుండా ప్రయాణం మొదలు పెట్టారు. అట్లా చాలా దూరం వెళ్ళాక, వాళ్లు పోతున్న దారి చీలింది- ఒక వైపుకు పోతే ఒక రాజ్యం,

రెండో వైపుకు పోతే రెండో రాజ్యం వస్తాయి. అప్పుడు వాళ్లు ఇద్దరూ ఏమనుకున్నారంటే- “ముందుగా మనం ఇక్కడ రెండు మొక్కలు నాటుదాం. తర్వాత ఇద్దరం తలా ఒక దారీ పట్టుకొని పోదాం. మనకు ఎదురైన రాజ్యాలలో మన మనసులకు నచ్చే రాకుమార్తెలు ఉన్నారేమో చూద్దాం, వీలైతే పెళ్ళి కూడా చేసుకుందాం! ఏది ఏమైనా సరే, మూడు నెలల్లో ఇక్కడికి తిరిగి వచ్చేయాలి. మనిద్దరిలో ఎవరం వచ్చినా సరే, ఇక్కడ రెండోవాడు నాటిన మొక్కను చూడాలి. అది బాగుంటే సోదరుడు బాగున్నట్లే లెక్క. వాడికోసం ఇక్కడే ఆగి ఎదురు చూడాలి. అట్లా కాక అది గనక వాడి పోయి ఉంటే వాడు కష్టాలు ఎదుర్కొంటున్నట్లు లెక్క. వాడికి 'సహాయం కావాలి' అని అర్థం, అదే ఆ మొక్క గనక పూర్తిగా చనిపోయి ఉంటే సోదరుడు చనిపోయాడన్న మాట! అప్పుడు ఇక అతని కోసం ఒక్క క్షణం కూడా ఆగనక్కర లేదు. సరేనా?” అని.

"సరే" అని ఇద్దరూ చెరొక దారిని పట్టుకొని పోయారు.

చిన్నవాడు అట్లా పోతుంటే అతనికి అందమైన రాజకుమార్తె ఒకామె ఎదురైంది. అటువైపు ఉన్న ఆ రాజ్యం ఆమెదేనట! వేటకోసమని ఆమె అడవికి వచ్చింది. అయితే తోటి సైనికులనుండి వేరుపడి అడవిలో దారి తప్పింది. దాహమై, నీళ్ళకోసం వెతుక్కుంటోంది.



"నాకు కూడా దాహంగానే ఉంది- పద- ఇద్దరం కలిసి నీళ్ళు వెతుక్కుందాం" అన్నాడు తమ్ముడు. అట్లా పోతుంటే వాళ్లకు ఒక చిన్న గుడిసె కనబడింది. గుడిసె తలుపు తట్టి, "కొంచెం నీళ్లు ఇస్తారా" అని అడిగారు

వాళ్ళు.

అంతలోనే గుడెసె లోపలి నుంచి 'రాయిగా మారిపో!' అని వినబడింది. వెంటనే చిన్న రాకుమారుడు, ఆ రాజకుమార్తె ఇద్దరూ- ఉన్నవాళ్ళు ఉన్నట్లే- రాళ్ళుగా మారిపోయారు!

ఇక పెద్దవాడు వెళ్తుంటే అకస్మాత్తుగా ఒక పులి అతని మీదికి దూకింది. రాకుమారుడు ధైర్యంగా పోరాడి, అతి కష్టం మీద దాన్ని తుదముట్టించాడు. దాని చర్మం, గోర్లు తీసుకొని అతను అవతలి రాజ్యం చేరుకున్నాడో, లేదో ప్రజలందరూ అతనికి జేజేలు పలికారు! అతన్ని తమ రాజుగారి దగ్గరికి తీసుకెళ్ళారు. "ఇన్నేళ్ళుగా మా వాళ్ళు ఎంతమంది ప్రయత్నించినా ఆ పులిని చంపలేకపోయారు. నువ్వు మహా వీరుడివి! నీకు మా అమ్మాయిని ఇచ్చి వివాహం చేస్తాను!" అన్నారు రాజుగారు. రాకుమారిని చూడగానే ఆమె నచ్చేసింది రాజకుమారుడికి! దాంతో వాళ్ళిద్దరికీ పెళ్ళి జరిగిపోయింది.

మూడు నెలలు కావస్తుండగా పెద్ద రాకుమారుడు తన భార్యకు, అత్తమామలకు చెప్పి, తను, తమ్ముడు విడిపోయిన చోటికి చేరుకున్నాడు. చూస్తే అక్కడ తమ్ముడు నాటిన చెట్టు వాడిపోయి ఉన్నది!

ఇంక ఆలోచించేది ఏమున్నది? తమ్ముడు ఏదో కష్టంలో ఉన్నాడని గబగబా తమ్ముడు వెళ్ళిన దారి వెంట వెళ్ళాడు అన్న. అక్కడ ఒక ఒంటరి గుడిసె, దాని ముందు రకరకాల సైజుల్లో రాళ్ళు కనిపించాయి. వాటిలో ఒక శిలను చూడగానే తన తమ్ముడి పోలికలు గుర్తించాడు రాజకుమారుడు. దాంతో సంగతి అర్థమైంది. 'ఏం చెయ్యాలా?' అని ఆలోచిస్తున్నంతలో గుడిసెలో ఏదో అలికిడి అయ్యింది. రాకుమారుడు వెంటనే ఒక రాయి మాటున నక్కాడు.

గుడెసె తలుపు తీసుకొని ఓ ముసలి మంత్రగత్తె బయటికి వచ్చింది. అక్కడున్న రాయినొకదాన్ని చూసి వికవికా నవ్వుతూ

"మీ బ్రతుకు ఇంతే. నన్ను మాట్లాడించద్దంటే విన్నారా? అందరూ శిలలై పడి ఉన్నారు!" అన్నది గట్టిగా.

ఆమె మాటలు విన్న రాజకుమారుడు ఉగ్రరూపుడైపోయాడు. సర్రున కత్తి దూసి, మంత్రగత్తె ముందు దూకాడు. ఆమె తేరుకునేలోగా ఆమెను హతం చేసాడు!

మంత్రగత్తె చనిపోగానే అక్కడున్న శిలలన్నీ మనుషులుగా మారిపోయాయి. వాళ్లలో తన తమ్ముడిని చూసిన రాజకుమారుడి సంతోషానికి మేరలేదు. అటుపైన తమ్ముడి పెళ్ళి తను మెచ్చిన రాకుమారితో వైభవంగా జరిగింది!

**సమయం ఏది?!**

వెంగళప్ప: ఎందుకు బాబూ! బండి ఇంత వేగంగా నడుపుతున్నావు?

వెంగళప్ప కొడుకు: ఈ ఉత్తరాన్ని సొంతదారుకు అర్జంటుగా చేర్చమన్నారు నాన్నా!

వెంగళప్ప: ఎక్కడుంటాడు బాబూ, అతను?

కొడుకు: అది చూసేంత సమయం కూడా లేదు నాన్నా!

వెంగళప్ప: సరే బాబూ, డ్యూటీయే ముందు. త్వరగా పోనివ్వు.



"రెండు ప్లేట్లు వేడి వేడి గారెలు పట్రావోయ్" ఆర్డరేశాడు బ్రహ్మానందం.

"చిత్తం సార్" వెళ్ళి రెండు నిమిషాల్లో తెచ్చాడు సర్వర్.

"ఆహా... కమ్మగా ఉన్నాయ్... ఉప్పు చక్కగా సరిపోయింది. పిండి రోట్లో రుబ్బారా?" తింటూ అడిగాడు బ్రహ్మానందం.

"అవును సార్"

"ఎంతైనా గ్రైండర్లో రుబ్బితే ఇంత రుచి రాదు. చాలా బాగున్నాయి. మరో నాలుగు పట్రా"

"థ్యాంక్యూ సార్. మీరైనా 'చెమట' విలువ గ్రహించారు" వెళ్ళాడు సర్వర్.



# ఊరు చేరిన పిల్లి

*రచన: జి. గాయత్రి, 9 వ తరగతి, పి.వి.ఆర్.జడ్.పి.హెచ్.స్కూల్, గుండువారి పల్లి, అనంతపురం జిల్లా.*



చాలా కాలం క్రితం పిల్లులు కూడా అడవిలోనే ఉండేవి. అప్పట్లో ఒకసారి ఓ పిల్లి తనుండే చోటును విడిచిపెట్టి, తన అన్న సింహాన్ని చూడడానికి వెళ్లింది. సింహం దాన్ని చూడగానే, "వచ్చావా, మంచిది మంచిది" అన్నది తప్ప, ఇంక మళ్ళీ మధ్యాహ్నం వరకూ పట్టించుకోలేదు.

ఇంక మధ్యాహ్నం అవుతుండగా, సభ చాలించి వచ్చి, అది పిల్లిని పిలిచింది.

పిల్లి రాగానే అది గట్టిగా గర్జిస్తూ "ఏంటి, ఇది?! నా భోజన సమయమయ్యింది కదా? నువ్వు నాకు ఇంక ఆకు కూడా వేయలేదు! ఇంత సోమరి తనం ఐతే ఎట్లా?" అన్నది.

పిల్లి వెంటనే పోయి ఓ అరటి ఆకు కోసుకొని వచ్చి సింహం ముందు వేసింది.

వెంటనే సింహం "ఏదీ?! ఈ వేళ ఉదయమే నేను ఓ తోడేలును పట్టుకొని తెచ్చాను కదా?! ఆ మాంసాన్ని వడ్డించు! వెంటనే!!" అంది.



పిల్లి గుహలోకి పోయి, తోడేలు మాసం తీసుకొచ్చి వడ్డించింది.

సింహం దాన్నంతా మెక్కేసి, "ఆహా! ఆనందంగా ఉంది. నా కడుపు నిండింది" అని త్రేన్చుతూ, పిల్లిని పిలిచి "ఇదిగో! అంతా శుభ్రం చేసేయ్!" అని చెప్పి, వెళ్ళిపోయింది. పిల్లి గుహనంతా శుభ్రం చేసి, ఆ తర్వాత తిందామని చూసుకుంటే గిన్నెలన్నీ ఖాళీగా ఉన్నాయి! పిల్లి కోసం కొంచెం మాంసాన్ని కూడా వదలలేదు సింహం.

మరుసటి రోజుకల్లా పిల్లికి నీరసం వచ్చింది; సింహానికి జ్వరం వచ్చింది. ఎంత జ్వరం వచ్చిందంటే, సింహం ఇక లేవలేక, సొమ్మసిల్లి, గుహలోనే పడుకుని మూలిగింది! ఆ రోజు సాయంత్రంగా అడవిలోని జంతువులన్నీ దాన్ని పరామర్శించటానికి వచ్చాయి. ఆహారం లేక తనకు ఎంత నీరసంగా ఉన్నా, వచ్చిన జంతువులన్నిటినీ ఉత్సాహంగా పలక-రించింది పిల్లి. జంతువులతో మాట్లాడే సరికి సింహానికి మళ్ళీ ఆకలైంది.

వెంటనే అది పిల్లిని పిల్చి, "సోదరా! వెళ్ళి అల్పాహారం తయారు చేయి!" అని ఆజ్ఞాపించింది.

పిల్లి దిబ్బ మొహం పెట్టి, "ఇంట్లో దినుసులు ఏమీ లేవు!" అంది. తన రాజ్యపు జంతువులముందు అట్లా అనే సరికి

సింహానికి ఎక్కడలేని కోపం వచ్చింది.

అది గట్టిగా గర్జిస్తూ "పిల్లీ! వెంటనే పరుగెత్తు! మనుషులు నివసించే చోటుకి పో! నీకు కనిపించిన ఇంట్లోంచి 'కొన్ని దినుసులు, ఓ నిప్పున్న కట్టె' తీసుకొని రా! వెళ్ళు!" అని అరిచింది.

నీరసించిన పిల్లి ఆ అరుపుకు గడగడ వణుక్కుంటూ అడవి దాటి, మనుషులు నివసించే ఊర్లోకి వెళ్లింది.



పిల్లికి మనుషులు కొత్త; వాళ్ళ ఇళ్ళు కొత్త; వాళ్ల తీరు తెన్నులూ కొత్తే.

అది అనుమానంగా అడుగులో అడుగు వేసుకుంటూ పోయి, ఆ దగ్గర్లో ఆడుకుంటున్న పిల్లల కంట పడింది. పిల్లలు చటుక్కున లేచి దాని వెంట పడ్డారు. అది పరుగు పెట్టాలని చూసిందిగానీ, అప్పటికి రెండు రోజులుగా భోజనం లేదుకదా, అందుకని వాళ్ళ చేతికి చిక్కింది.

పిల్లలంతా తనని దొరకబుచ్చుకోవటం, ముఖంలో ముఖం పెట్టి చూడటంతో పిల్లికి చాలా భయం వేసింది. "ఏయ్! నువ్వు ఏమీ భయపడకు! నిన్ను మేం ఏమీ చెయ్యములే" అని బుజ్జగించి వాళ్ళు దాన్ని చేతుల్లోకి తీసుకున్నారు. "అబ్బ! "ఎంత మృదువుగా ఉందో! ఎంత అందంగా ఉందో!" అంటూ పిల్లలు అందరూ దాన్ని చాలా ముద్దు చేసారు. ఒక్కొక్కరూ దాన్ని సున్నితంగా ఎత్తుకున్నారు; నవ్వారు; నవ్వించాలని చూసారు. వాళ్లలో ఒకడు వెళ్ళి దానికి పాలు తీసుకొచ్చి పోసాడు. అది ఆత్రంగా తాగుతుంటే పిల్లలంతా చుట్టూ చేరి వింతగా చూసారు!ఆ హడావిడిలో పిల్లి తను వచ్చిన పనిని మర్చిపోయింది. 'నాకు ఎన్నడూ, ఎవ్వరి నుండీ కూడా ఇంత ప్రేమ దొరకలేదు!" అని చాలా సంతోషపడుతూ

ఉండిపోయింది.



అంతలో ఒక్క సారిగా అడవిలోంచి సింహ గర్జన వినబడింది. పిల్లలంతా భయపడిపోయారు. పిల్లి కూడా భయంతో వణికిపోయింది: తను ఊళ్ళోకి ఎందుకు వచ్చిందో అప్పుడు గుర్తుకు వచ్చింది దానికి!

వెంటనే అది గబగబా ఒక ఇంట్లోకి దూరి, మండుతున్న ఓ కట్టెను తీసుకొని పొదలు, రాళ్ళు దూకుతూ అడవిలోకి పరుగు పెట్టింది.

ఊళ్ళో ఉన్న పిల్లలంతా దాని వెంట పడ్డారు. పిల్లి సింహం గుహ చేరుకునే సరికి కోపంతో, ఎర్రబడిన కళ్లతో ఉన్న సింహం కనిపించింది దానికి. దాన్ని చూసే సరికి పిల్లికి ఎంత భయం వేసిందంటే, అది తన చేతిలో ఉన్న కట్టెను అక్కడే పడేసి వెనక్కి తిరిగి ఊళ్ళోకే పారి పోయింది. అప్పుడు అంటుకున్న గడ్డిని ఆర్పేసరికి అడవిలోని జంతువుల తలప్రాణం తోకకు వచ్చింది!



అట్లా ఇక ఆ రోజు నుండి పిల్లి ఊళ్ళో పిల్లల దగ్గరే ఉండిపోయింది.

కొత్తగా ఎవర్ని చూసినా హిందీలో- "మై ఆవూం.. (నేను రానా?)" అని అడగటం మొదలెట్టింది. అప్పుడంతా పిల్లలు దాన్ని రమ్మని, ముద్దు చేసి, "పిల్లీ! నువ్వు మళ్ళీ ఎక్కడికీ వెళ్లవు కదా?" అని అడిగే వాళ్ళు. "లేదు- నేను ఇంక ఎక్కడికీ వెళ్లను!" అని తల ఊపేది పిల్లి!



# బొమ్మకు కథ రాయండి

*రామ చిలక అరటిపండు తింటోంది... ఎవరో తినిపిస్తున్నారు...చూస్తే ఇక్కడేదో కథ ఉందని తెలియట్లేదూ?! తెలుస్తూనే ఉంది ! మీరు చక్కగా ఊహించి, ఆ కథేదో రాసి పంపండి ; బాగున్న కథల్ని మేం ప్రచురిస్తాంగా, రాయండి మరి !*



మా చిరునామా: కొత్తపల్లి, 1-127/A, MROఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా-515101



# చారులో ఉప్పు

శ్లోక చమత్కారం

*సేకరణ, కథనం : శ్రీ ఇ యన్ వి. రవి , అనంతపురం.*

కోలాచలం అనే ఊళ్ళో మల్లినాథుడు అనే యువకుడు ఒకడు ఉండేవాడు. వాడు వట్టి పోకిరి; చదువు సంధ్యలు లేవు. ఊరికే బలాదూరుగా తిరుగుతుండేవాడు. అలాగే బాల్యం అంతా గడిపేశాడు. యువకుడయ్యాడు.

పెళ్ళైతే బాగుపడతాడేమోనని అతడికి పెళ్ళి చేశారు ఇంటి వాళ్ళు. భార్య పాపం, చక్కగా చదువుకుంది. భర్త మూర్ఖత్వాన్ని చూసి ఆమె కుమిలిపోతుండేది. ఎలాగైనా అతనికి బుద్ధి గరపాలని అనుకునేది. ఆ సందర్భమూ రానే వచ్చింది.

ఓ మారు ఇంట్లో ఏదో పండుగ వచ్చింది. ఇంటినిండా చుట్టాలు వచ్చి ఉన్నారు. అందరూ ఏవోవో పనుల్లో ఉన్నారు. "వెళ్ళి పూజకు కాసిన్ని పూలు తీసుకురారా, మల్లినాథా" అన్నారు.

మల్లినాథుడు అటూ ఇటూ చూసాడు.

ఇంటికి ఎదురుగా ఉన్న ఓ పెద్ద మోదుగ చెట్టు కనిపించింది. నేరుగా వెళ్ళి, చెట్టెక్కి, బుట్టనిండా మోదుగపూలు కోసుకొచ్చాడు.

మోదుగపూలేమో మరి పూజకు పనికి రావాయె! అతనికి పని అప్పజెప్పిన పెద్దవాళ్ళు నెత్తికొట్టుకున్నారు- “పోరా! పోయి ఎక్కడైనా ఓ మూలన కూర్చో! పనేమీ చెయ్యకు! అనవసరంగా ఇంకోళ్ళకి కష్టం!” అంటూ అతనిని అక్కడ నుంచి తరిమేసారు.

ఇంటికి వచ్చిన బంధువులు కూడా అతన్ని చూసి నవ్వారు. అయినా మన మల్లినాథుడికి మాత్రం వాళ్ళెందుకు నవ్వారో అర్థం కాలేదు.

కాసేపటికి, పూజలవీ అయిన తర్వాత, అందరూ భోజనాలు చేస్తున్నారు. భార్య అతనికి చారు వడ్డించింది. కానీ ఆ చారులో ఉప్పు వెయ్యలేదు !

’ఉప్పు లేదేంటి?’ అన్నాడు మల్లినాథుడు. అందుకు భార్య ఇలా చెప్పింది.

**చారు చారు సమాభాతం**
**హింగు జీర సమ్మిశ్రితమ్ |**
**లవణ హీనం న శోభన్తే**
**పాలాశ కుసుమం యథా॥**

"బాగా చిక్కటి రంగుతో, ఇంగువ, జీలకర్ర వంటి దినుసులతో చేసినా సరే, తగినంత ఉప్పు లేని చారు - 'మోదుగపువ్వు పూజకు ఎలా పనికిరాదో అలా'- అస్సలు బావుండదు"



అది విని భోజనాలకు కూర్చున్న బంధువులందరూ పెద్దపెట్టున నవ్వారు. మల్లినాథునికి అవమానమయ్యింది.

తింటూ తింటూ మధ్యలోనే చేతులు కడుక్కుని లేచిపొయ్యాడు!

అలా పోయిన వాడు, నేరుగా కాశీకి వెళ్ళిపోయాడు.

అక్కడ పండితులను ఆశ్రయించి అన్ని శాస్త్రాలూ నేర్చుకుని మహా పండితుడు అయ్యాడు. మల్లినాథ 'సూరి' అనిపించుకున్నాడు. 'సూరి' అంటే 'పండితుడు' అని అర్థం.

మల్లినాథ సూరి ఇంటికి తిరిగి వచ్చాడు. సంస్కృతంలో కాళిదాసు, భారవి వంటి ప్రముఖుల కావ్యాలకు వ్యాఖ్యానాన్ని రచించి ఎనలేని పేరు ప్రతిష్టలు సంపాదించాడు.

ఇప్పుడు అతన్ని చూసి భార్య మెచ్చుకున్నది. బంధువులు ఆనందించారు. అట్లాంటి ఆ మల్లినాథసూరి తెలుగు వాడవటం మనకు గర్వకారణం.

మెకానికల్ ఇంజనీరింగ్ తరగతి:

ప్రొఫెసర్ కోదండం : స్టూడెంట్స్, ఇంజన్ ఎలా స్టార్ట్ అవుతుందో చెప్పండి?

ముకుందం : నాకు తెలుసు సార్! ఇంజను తుర్ తుర్ తుర్ తుర్ .... మని స్టార్టవుతుంది!



**అసలైనవాడు!**

నలుగురు కుర్రాళ్ళు ఒక మోటార్ సైకిల్‌మీద అరుచుకుంటూ పోతున్నారు. ట్రాఫిక్ పోలీస్ జగన్నాథం అతి కష్టం మీద వాళ్ళని ఆపాడు:

జగన్నాథం : టూ వీలర్ మీద ముగ్గురు రావడమే నేరం! అట్లాంటిది మీరు నలుగురు వస్తున్నారు! పై పెచ్చు త్రాగి అరుస్తున్నారు! పదండి స్టేషన్‌కి!

మోటార్ సైకిల్ నడుపుతున్న కుర్రాడు హఠాత్తుగా వెనక్కి చూసి అరిచాడు:

కుర్రాడు: 'వార్నీ, ఐదో వాడెక్కడ పడిపోయాడ్రా! ఇవ్వాళ పార్టీకి బిల్ కట్టాల్సింది వాడే! '



# కలయక్షిణి గాథ

*ఒకసారి పెంచుకున్న ద్వేషం ఎవ్వరినీ అంత సులభంగా విడిచి పెట్టదట. అందుకని అసలు ద్వేషాన్ని రానివ్వకుండానే ఉంటే భలే ఉంటుంది! కానీ అదెలాగబ్బా, చేసేది?!*

*మూలం: ధమ్మపథ గాథలు* *సరళీకరణ: నారాయణ*

ఒకప్పుడు కాశీనగరంలో సంపన్న వ్యాపారి ఒకడు ఉండేవాడు. అతను, అతని భార్య సంతానం కోసం తిరగని తావు లేదు; దర్శించని క్షేత్రమూ లేదు. అయినప్పటికీ వాళ్లకు పిల్లలు పుట్టలేదు. చూసి చూసి, బంధువుల పోరు పడలేక, వ్యాపారి ఇంకొకామెను పెళ్ళి చేసుకున్నాడు.

అయితే భార్యలు ఇద్దరికీ మధ్య పచ్చ గడ్డి వేస్తే భగ్గుమనేది: ఒకరంటే ఒకరికి ఏమాత్రం సరిపడేది కాదు. దాంతోపాటు వాళ్ళు ఒకరి

మీద కోపాన్ని మరొకరి మీద, చివరికి వ్యాపారి మీద- తీర్చుకోటం మొదలుపెట్టారు. దాంతో వ్యాపారి బ్రతుకు దుర్భరమయింది; ఆరోగ్యం పాడైంది; వ్యాపారం దెబ్బతిన్నది; అతనిలో పశ్చాత్తాపం మొదలయింది.



అయితే ఆలోగా భార్యలిద్దరూ ఒకరినొకరు చంపుకునేందుకు కూడా పథకాలు రచించడం మొదలుపెట్టారు!

సరిగ్గా ఆ సమయంలో మొదటి భార్య గర్భం ధరించింది. అసూయతో రగిలిపోయిన రెండవ భార్య, ఆమెను చిత్ర విచిత్రంగా హింసించేందుకు పూనుకున్నది. ఇక అప్పుడు మొదటి భార్య తనని, తన గర్భాన్ని కాపాడుకోవటం కోసం చిన్న ఆమెను పూర్తిగా అడ్డు తొలగించుకునేందుకు ప్రయత్నించింది!

ఆ విధంగా పెద్దభార్య పన్నిన కపటోపాయంతో చిన్న ఆమె నిజంగానే చనిపోయింది- కానీ అనుకోకుండా పెద్దభార్య కూడా పురిటిలోనే కన్ను మూసింది!

శరీరాలు రెండూ నశించినై. కానీ, సవతులిద్దరి వైరం మటుకు అలా కొనసాగుతూనే పోయింది. తరువాతి జన్మలో వాళ్లిద్దరూ ఒకరు కోడి గానూ, మరొకరు పిల్లిగాను పుట్టారు. కోడి గుడ్లను పిల్లి ఎత్తుకుపోయేది; పిల్లిని కోడి తరిమేది! వాటి మధ్య వైరం అలా కొనసాగాక, తరువాతి జన్మలో అవే- ఒకటి పావురం గానూ, మరొకటి చిరుతపులి గానూ-

జన్మించాయి. అయినా వాటి వైరం అలాగే కొనసాగుతూ పోయింది!



ఆ విధంగా 'జన్మ శత్రువులు' అయిన ఆ రెండూ బుద్ధుడు జీవించి ఉండిన సమయంలో కూడా తమ పోరాటాన్ని కొనసాగించుకునేందుకు పుట్టాయి. శ్రావస్తీ నగరంలో ఒక వ్యాపారికి కూతురుగా ఒకామె పుట్టగా, ఆ ప్రక్కనే గల అడవిలో తిరుగాడే యక్షిణిగా మరొకామె జన్మించింది.

వ్యాపారి కూతురికి పెళ్లై ఒక బిడ్డ పుట్టేసరికి, యక్షిణి ఆమెను, ఆమెకు పుట్టిన పిల్లను పీడించటం మొదలు పెట్టింది. అనేక రోగాలు, రొష్టులు, దు:ఖాలకు గురైన వ్యాపారి కూతురు, తిరగబడింది. తను కూడా యక్షిణిని దెబ్బ తీసేందుకు గట్టిగా ప్రయత్నించింది. కానీ అసమానమైన శక్తులు కలిగి ఉండి, అనేక జన్మలుగా వచ్చిన వైరంతో కుతకుతలాడిపోతున్న యక్షిణి బలం ముందు ఆమె ప్రయత్నాలేమీ ఫలించలేదు.

అలాంటి ఆ సమయంలో వ్యాపారికి ఎవరో చెప్పారు, బుద్ధుడి గురించి: "దు:ఖానికి కారణం ఏంటో చూశాడట ఆయన. నీ కూతురి దు:ఖాన్ని పోగొట్టే ఉపాయం ఆయన వద్ద ఉంటుందేమో, ప్రయత్నించరాదూ?" అని.

ఒక చేతిలో బిడ్డను పట్టుకొని, అదృశ్యంగా కలయక్షిణి వెంటరాగా, వ్యాపారి కూతురు దీనంగా బుద్ధుడిని సమీపించి తనకు విముక్తి కల్పించమని వేడుకున్నది.

ఆమెను, ఆమె వెనక అదృశ్యంగా వచ్చిన యక్షిణిని, వారిద్దరి గతాన్ని కూడా దర్శించిన బుద్ధుడు చిరునవ్వుతో- "తల్లీ-

**నహి వేరేన వేరాని సమ్మంతీథ కుదాచనం**

**అవేరేనచ సమ్మంతి ఏసధమ్మో సనంతనో**

"లోకంలో ఎప్పుడైనాగాని ద్వేషాన్ని ద్వేషంతో శాంతింపజేయలేము. ప్రేమతోటీ, సద్భావన తోటీ మాత్రమే వైరాన్ని జయించగలం. ఇది ఏనాటికీ వర్తించే న్యాయం- సనాతన ధర్మం"

"మీ ఇద్దరికీ మధ్య పెరుగుతూన్న వైరానికి ఇకనైనా స్వస్తి పలకండి. 'ఒకరినొకరు ద్వేషించడం, ఒకరినొకరు దెబ్బ తీసుకోవడం' అన్న ఆలోచనను ప్రక్కన పెట్టి మీ మీ మనసులను నిష్కల్మసంగా చేసుకోవడం ఎలాగో తెలుసుకోండి" అని, సులభమైన ధ్యాన మార్గాన్ని బోధించాడు.

ఆ బోధను స్వీకరించేందుకు సిద్ధంగా ఉండిన కలయక్షిణి అప్రయత్నంగానే శ్రోతాపన్నురాలైంది. ఆమెలోని క్రోధం, ద్వేష భావం శాంతించాయి. స్నేహ సద్భావనల కారణంగా అనేక జన్మల వైరం అంతమైంది.

అటుపైన వ్యాపారి కూతురు కూడా ధర్మ మార్గంలో పయనించి తన మనసును ద్వేష రహితంగా చేసుకున్నది!



**తప్పెవరిది?!**

నాలుగో తరగతి దీప్తి వంటపనిలో ఉన్న అమ్మని తదేకంగా చూస్తోంది.

నవ్వు!

అమ్మ: ఏమిటే! ఏం చూస్తున్నావ్ ?

దీప్తి: నీకు కొన్ని వెంట్రుకలు తెల్లగా ఎందుకున్నాయమ్మా?

అమ్మ (నవ్వుతూ): నువ్వు అల్లరి చేస్తూ, చికాకు పడుతూ, చదువుకోకుండా ఏడుస్తూ నన్ను బాధ పెడతావుగా?! అలా బాధ పెట్టినప్పుడల్లా నాకు ఒక్కో వెంట్రుక తెల్లబడిపోతుంది

దీప్తి: మరి అమ్మమ్మ వెంట్రుకలన్నీ తెల్లగా అయిపోయాయెందుకు?



# నేతగాడు-డ్రాగన్

ఐరిష్ జానపద కథ

*సౌజన్యం: స్టోరీ నోరీ డాట్ కాం.*

అనగనగా డులీక్‌లో ఒక నేతగాడు ఉండేవాడు. ఒకరోజు ప్రొద్దున అతను మగ్గం ముందు కూర్చొని ఉండగా, "అయ్యా బువ్వ తినిపోదురా" అని ఇంటామె పిలిచింది.

"ఇదిగో నావెంట పడకు! క్రొత్త డిజైన్ మొదలుపెట్టాను; అది బాగా వచ్చేంతవరకు నేను ఇక్కడ నుండి కదిలేది లేదు" అరిచాడు నేతగాడు.

"నీకోసం దోసెలు పోశానయ్యా! చల్లారి పోతే బాగుండవు" అన్నది ఇంటామె. నేతగాడికి కోపం వచ్చింది. తిట్లు లంకించుకున్నాడు. "నీ దోసెలు కూల- నాతో మాట్లాడకు! నీకేం కావాలో అది చేసుకో!" అనేసాడు.

"ఇంత మంచి దోసెల్ని తిట్టినందుకు దేవుడు నిన్ను ఏమీ చేయకపోతే అదొక్కటే చాలు!" అని గొణిగింది భార్య.

ఆ తర్వాత రెండు గంటలకు నేతగాడు పని పక్కన పెట్టి, లేచి వెళ్లే సరికి దోసెలు చట్ట చల్లారి పోవటమే కాదు; ఒక్క మిల్లీ మీటరు ఖాళీ కూడా లేకుండా అవి నల్లగా- మాడిపోయినట్లు- కనబడ్డాయి!

"ఇదేంటి, దోసెలు ఏమిటి, నల్లగా ఉన్నాయి?" అని అతను దగ్గరగా వంగి చూసేసరికి తెలిసింది: నల్లగా ఉన్నవి దోసెలు కావు వాటి మీద మూగిన ఈగలు! వానాకాలం కదా, ఊళ్లో ఉన్న ఈగలన్నీ వచ్చి తేరగా పెట్టిన దోసెల మీద వాలాయి!



నేతగాడు ఈగల్ని కసితీరా తిట్టి "దయ్యాల్లారా! ఇంత మంచి మంచి దోసెల్ని పాడు చేయడానికి మీకెన్ని గుండెలు?" అని అరిచాడు. అయితే ఆ అరుపుతో వాడి కోపమేమీ తగ్గలేదు; ఈగలు కూడా ఎగిరిపోలేదు. దానితో వాడు ఇక ఆగలేక పోయాడు: అరచేయి చాచి, దోశల్ని ఒక్క చరుపు చరిచాడు. కొన్ని ఈగలు ఎగిరి పో-గలిగాయి. కాని చాలా ఈగలు చచ్చిపోయాయి కూడా.

చచ్చిపోయిన ఈగలన్నిటినీ దోసెలనుండి వేరుచేసి క్రిందపడేస్తూ లెక్కపెట్టాడు నేతగాడు. మొత్తం డెబ్బై ఈగలు లెక్కతేలాయి. "ఒక్క దెబ్బకు డెబ్బై దయ్యాలు!" అని వాడికి చాలా సంతోషమైపోయింది.

చచ్చిపోయిన ఈగల్ని మళ్లీ మళ్లీ లెక్కపెట్టిన కొద్దీ వాడి సంతోషం రెట్టింపైంది. తన లోపల మహోత్తరమైన శక్తి ఏదో ఉదయించినట్టు, తన గొప్ప వీరయోధుడు అయిపోయినట్లు వాడికి అనిపించసాగింది. ఒకే దెబ్బకు డెబ్బై డెబ్బై ప్రాణాలు తీసినందుకు వాడు గర్వంతోటీ, అతిశయంతోటీ ఉబ్బి-పోయాడు.

ఇక ఆ రోజంతా వాడు ఒక సెంటీ మీటరు బట్ట కూడా నేయలేదు. ఊరంతా కలియ తిరిగి, కనిపించిన వాడికల్లా "ఇదిగో ఈ చేత్తోటే!! ఒక్క చరుపుతో డెబ్భై ప్రాణాలు తీశా! ఊరికేనా?!" అని చెప్పుకోవటం మొదలుపెట్టాడు.

"చూడండి! ఇన్నేళ్లుగా నేను నేత పనిలో మునిగి, నాశక్తుల్ని గుర్తించక, జీవితాన్ని వృధా చేసుకున్నాను. నిజంగా నేను ఎవరు అయ్యి ఉండాలో చెప్పమంటారా? అసలు నేను ఆ చక్రవర్తినే అయి ఉండచ్చు; లేదా ఆయన్నే భయపెట్టే డ్రాగన్ అవతారాన్ని కూడా అయి ఉండచ్చు- లేదా వాళ్లిద్దర్లో ఎవరో ఒకర్ని అయ్యి ఉండచ్చు! అర్థమైందా, ఇవాల్టి నుండి నేను మామూలు నేతగాడిని కాదు. 'సంచరించే వీరయోధుడిని' నేను. ఆ సంగతి మీరు గుర్తించండి- సంచారంలో ఉన్న వీర యోధుడ్ని నేను!" అని గట్టిగా అందరికీ చెప్పుకుంటూ తిరిగాడు.

దానికి తగినట్టుగా మరుసటి రోజు తెల్లవారగానే ఇరుగు పొరుగు ఇళ్లకంటా వెళ్లి, తనకు కనబడ్డ పాత పుల్లల్ని, టీ కాచే గిన్నెల్ని కొట్టుకొచ్చాడు. వాటన్నిటినీ తన దగ్గరున్న ఓ మొద్దు చర్మపు ముక్కతో కలియగుట్టి, కవచంలాంటి దాన్ని ఒకదాన్ని తయారు చేశాడు.

ఆ తర్వాత తను సంపాదించిన ఓ పాత బాణలిని తన మిత్రుడైన ఓ పెయింటర్ దగ్గరకు తీసుకెళ్ళి, అతనిచేత దానిమీద పెద్ద అక్షరాలలో రాయించాడు: "ఒక దెబ్బకు 70 ప్రాణాలు తీసిన వీరయోధుడు ఇతడే!" అని!




"నా డాలు మీద అట్లా రాసి ఉన్న దాన్ని చదివి, ప్రజలందరూ కొంచెం కొంచెంగా

కంపించిపోతారు” అన్నాడతను.

ఇవన్నీ చేసిన తర్వాత అతను ఇంటికి వెళ్ళి ఇల్లాలిని ఆజ్ఞాపించాడు- "ఇదిగో! పాత కుండను ఒకదాన్ని బాగా రుద్ది, నల్లగా మెరిపించి ఇవ్వు!” అని. "నిజంగా మెరిసిపోవాలది! చూసినవాళ్ళ కళ్ళు మిరమిట్లు గొలవాలి!" అన్నాడు.

"దానితో ఏం చేస్తావు? నెత్తిమీద పెట్టుకుంటావా?” అన్నది భార్య, ఒకింత అనుమానంగా.

"అవును. సరిగ్గా కనుక్కున్నావు!” అన్నాడు నేతగాడు. "వీరయోధుని తల మీద ఆ మాత్రం బరువు ఉండాలి"

"కానీ దానికి రంధ్రాలు ఉన్నాయి కదా, వాన కురిస్తే నీళ్ళు కారతాయి కదా?” అన్నది భార్య, ఎలాగైనా అతనిచేత ఈ పనిని ఆపించాలని.

"మరీ మంచిది. అప్పుడు తలంతా చల్లగా, హాయిగా ఉంటుంది! అట్లాగే ఉండనియ్యి చిల్లుల్ని!” ఆనతిచ్చాడు వీరుడు.

"కానీ దీనికున్న హ్యాండిల్ వికారంగా ఉంది- ఈ హ్యాండిల్ ఒక్కటీ లేకపోతే ఇది నిజంగానే శిరస్త్రాణంగా పనికొచ్చును! " అన్నది భార్య.

"పిచ్చిదానా, నీకేం తెలుసు?! ప్రతి శిరస్త్రాణంలో నుండి కనీసం కొన్ని కొమ్ములైనా బయటికొచ్చి ఉండాలి. అదే అసలు రహస్యం" అన్నాడు నేతగాడు గర్వంగా.

చివరికి "నీయిష్టం" అనేసింది భార్య, కుండను మరింత గట్టిగా రుద్దుతూ. " నీ గొర్రె తలకి ఇంతకంటే గొప్ప కిరీటం సరిపోదులే" అంటూ.

"బాగు బాగు! కనీసం ఇప్పటికైనా నా గొప్పతనాన్ని గుర్తించావు. అది చాలు!" అని నేతగాడు తను కుట్టిన కవచాన్ని ధరించి, తను తయారు చేసుకున్న కిరీటం పెట్టుకొని కాలి నడకనే బయలుదేరి పోయాడు.

అట్లా ఊరు దాటేసరికి వాడికి ఓ ప్రక్కన గడ్డి మేస్తున్న గుర్రం ఒకటి కనిపించింది. గుర్రపు

యజమాని మిల్లర్ కొద్ది దూరంలో చెట్టుకు ఆనుకొని కునుకుతున్నాడు.

"ఇదిగో- ఇదే, నా యుద్ధాశ్వము!" అన్నాడు యోధుడు గట్టిగా- "ఇంతకాలమూ ఇది ఈ మిల్లర్ మూటలు మోస్తూ బతికింది. ఇప్పుడు ఇక ఇది నా శౌర్య ప్రతాప సుమాలను మోసుకెళ్తుంది!" అని వాడు గబ గబా గుర్రం మీదికి ఎక్కి తోలబోయాడు దాన్ని. కానీ అంతగా అలవాటు లేని ఆ గుర్రం ఓమారు గట్టిగా సకిలించి, ముందు కాళ్లు రెండూ ఒకేసారి పైకెత్తింది! దాని కాళ్లక్రింద పడకుండా ఉండేందుకు జీనును, కళ్ళాన్ని పట్టుకొని వ్రేలాడసాగాడు వీరయోధుడు.

గుర్రపు సకిలింత విని కళ్ళు తెరిచి చూసిన మిల్లర్ ఒక్క క్షణం బిత్తరపోయి, తేరుకొని బిగ్గరగా నవ్వుతూ "నా మహత్తర పంచకల్యాణి గుర్రాన్ని నా అనుమతి లేకుండా దొంగిలిస్తున్నది నువ్వేనా, ఓ నా నిజమైన వీరయోధుడా?!" అని అరిచాడు వెటకారంగా.

"లేదు లేదు! చల్లని సాయంత్రం వేళ అశ్వాన్ని ఇలా వ్యాయామం చేయించేందుకు తీసుకెళ్తున్నా. యుద్ధాశ్వాలకు వ్యాయామం ఎంత అవసరమో నీకు తెలీని సంగతి కాదు" అన్నాడు నేతగాడు, సమయస్ఫూర్తితో.

"థాంక్యూ! కానీ నా గుర్రాన్ని ఉన్న చోటే వదిలి పారిపో, మర్యాదగా!" పళ్లు నూరాడు గుర్రపు యజమాని మిల్లర్.

"క్షమించు మిత్రమా! యుద్ధరంగం పిలిస్తోంది. కాలక్షయం కూడదు. వీరులంతా నా కోసమే చూస్తున్నారు! దేశ హితం కోసం నువ్వీ పంచకల్యాణి గుర్రాన్ని త్యాగం చేయక తప్పదు!" అని అరిచి, అరచేత్తో గుర్రాన్ని చెళ్ళున చరిచి ముందుకు దూకించి, క్షణంలో కనుమరుగయ్యాడు నేతగాడు.

(మూడు భాగాల ధారా వాహికలో ఇది మొదటి భాగం. ఆ తర్వాత ఏం జరిగిందో వచ్చే సంచికలో చూద్దురు! అంత వరకూ టెన్షన్..టెన్షన్!





# యువరాణి-పిల్లి

*మూలం: యూరోపియన్ జానపద కథ.* *అనుసరణ: నారాయణ, కొత్తపల్లి*

యువరాణి ఏరియల్‌కి ఈ మధ్యనే పెళ్లైయింది. ఫిలిప్ యువరాజు అందగాడు, వీరుడునూ. వాళ్లిద్దరూ ఒకరికొకరు తగిన జంట. రాజావారు వాళ్లకి రాజ్యాన్నప్పగించి విశ్రాంతి తీసుకుందామనుకున్నారు.

అంతలోనే అనుకోని ఉపద్రవం ఒకటి వచ్చి పడింది. విహారానికని ఒంటరిగా వెళ్లిన యువరాణి ఏరియల్ తిరిగిరాలేదు.

రాజ్యమంతటా వెతుకులాట మొదలైంది. ఎక్కడా ఏరియల్ జాడలేదు. ఆమె జాడను కనుగొన్నవారికి కోటి రూపాయలు బహుమతి ప్రకటించారు రాజుగారు. అయినా ఏరియల్ జాడ తెలియరాలేదు. రాజావారు రాణివారు మనోవ్యాధితో కృంగిపోసాగారు. అల్లుడు ఫిలిప్ మనిషి మనిషిగా లేడు.

కొద్దిరోజులు ఇలా గడిచాక "మామయ్యా! ఇకలాభం లేదు. నేనే స్వయంగా వెళ్తాను.

ఏడు ఖండాల్లో ఏరియల్ ఎక్కడున్నా వెదకి తెస్తాను." అని గుర్రం ఎక్కి బయల్దేరాడు.

ముందుగా వాళ్ల రాజ్యపు అడవిలో కొద్దిరోజులు గడిపి, అంగుళం అంగుళం పరిశోధించాడు రాజకుమారుడు. ఎక్కడా అతనికి ఎలాంటి ఆధారాలు కనిపించలేదు.

అంతలోనే అతని కళ్ల ఎదురుగా ఓ పాము- మెల్లగా చెట్టు మీదికి ఎగ బ్రాకింది. చెట్టు మీద ఉన్న గూట్లో పక్షి పిల్లలు ప్రాణ భయంతో అరవసాగాయి. యువరాజు ఫిలిప్ చేతిలోని చురకత్తి తటాలున పైకి లేచింది. ఆ పామును రెండు ముక్కలు చేసేసింది.

సరిగా అదే సమయానికి తిరిగి వచ్చిన తల్లి పక్షి, తండ్రి పక్షి భద్రంగా ఉన్న పిల్లల్ని చూసుకొని మురిసిపోయాయి. చెట్టు క్రింద నిలబడి వాటి రాకను గమనించిన యువరాజు చిరునవ్వుతో ముందుకు కదిలాడు. అంతలోనే ధగధగ లాడుతున్న కిరీటం ఒకటి అతని ముందుకు వచ్చి పడింది.

ఫిలిప్ ఆ కిరీటాన్ని పట్టుకొని 'అది ఎట్లా వచ్చి పడిందా' అని పైకి చూశాడు. చెట్టు మీది పక్షుల జంట అతని వైపుకే చూస్తూ వింత గొంతులతో అరవసాగాయి.

"మీరు నాకేం చెబుతున్నారో అర్థం కావట్లేదు" అన్నాడు యువరాజు వాటితో.

పక్షులు ఇంకా గట్టిగా అరిచాయి. అంతలోనే వాటిలో ఒకటి తటాలున ఎగిరి వచ్చింది. నేరుగా యువరాజు చేతిలోని కిరీటాన్ని ఎగరేసుకుపోయింది!

యువరాజు గుర్రమెక్కి ఆ పక్షిని అనుసరించాడు. పక్షి చాలా దూరం ఎగురుతూ పోయింది. అడవి ఇంకా ఇంకా దట్టంగా మారింది. ఇప్పుడు యువరాజు ఉన్న ప్రాంతం అంతగా నర సంచారం లేనిది. విరిగిపడిన కట్టెలు, పుల్లలు ఎక్కడి వక్కడే మట్టిలో కలిసిపోతున్నాయి. పక్షుల కిలకిలలు, ఏటి గలగలలు తప్ప ఎక్కడా ఇంక వేరే ఏ శబ్దాలూ వినబడటం లేదు. నేలంతా చిత్తడి చిత్తడిగా ఉంది. ఆ నేలలో ఎవరివో కాలిగుర్తులు...!

పక్షిని, పాదముద్రల్ని గమనిస్తూ ముందుకు సాగాడు యువరాజు ఫిలిప్. రాను రాను చెట్లు మరింత దట్టంగా మారాయి. చీకటి పడసాగింది. యువరాజు ఆ రాత్రికి అక్కడే చెట్ల మీద పడుకొని విశ్రాంతి తీసుకున్నాడు. ఉదయాన్నే లేచి చూస్తే- క్రింద కట్టేసిన గుర్రం మాయం!

చేసేదేమున్నది?! యువరాజుకి మెల్లగా చెట్టు దిగి, కాలినడకనే ముందుకు సాగాడు. కొద్ది దూరం పోయే సరికి, కొండ గాలి జాడన, అతనికి గుర్రపు సకిలింత ఒకటి వినిపించింది.

అటుగా పరుగుపెట్టాయి, అతను కాళ్లు. కొద్ది సేపటికి ఫిలిప్ ఒక విశాలమైన గడ్డి మైదానాన్ని చేరుకున్నాడు. నేల మీదంతా ఒత్తుగా గడ్డి పరచుకొని ఉన్నది. ఎదురుగా ఓ జలపాతం.. సన్నగా శబ్దం చేస్తోంది. గుర్రం జాడలేదు.

యువరాజు చకచకా జలపాతాన్ని సమీపించాడు. చల్లని ఆ నేలలో ముఖం కడుక్కొని సేదతీరాడు. చల్లటి ఆ నీళ్లు అతనికి ఒక కొత్త ఉత్సాహాన్ని, శక్తిని ఇచ్చాయి. అంతలోనే మళ్లీ ఒకసారి గుర్రపు సకిలింత!! సందేహంలేదు- అది తన గుర్రమే!



యువరాజు ఆ ప్రదేశం అంతటా గాలించాడు. జలపాతం, కొండ గడ్డి తప్ప మరేమీ లేనిది ఈ ప్రదేశం. మరి తన గుర్రం ఎక్కడుండి ఉంటుంది?

అన్ని వైపులా కలియ జూసాడు ఫిలిప్. ఎక్కడా గుర్రం జాడ లేదు. అయితే దప్పిక గొన్న యువరాజును జలపాతం ఆకర్షించింది. మెల్లగా అతని దాని వైపుకు

నడిచాడు.. జలపాతానికి వెనకవైపున చీకట్లో దాక్కొని ఉన్నది ఒక గుహ!

యువరాజు కత్తిని చేతబూని ధైర్యంగా గుహలోకి ప్రవేశించాడు. అదేమీ చిన్న గుహ కాదు- చాలా దూరమే సాగింది, సొరంగం లాగా. ఫిలిప్ యువరాజు ధైర్యంగా ఆ సొరంగంలో నడక సాగించాడు.

సొరంగం అంతా చీకటి నిండి ఉన్నది. అయితే అక్కడక్కడా కొండ బండల మధ్యలో ఉన్న సందుల గుండా బయటి కాంతి లోనికి వస్తున్నది. గుహ చివరికల్లా చేరుకున్న యువరాజుకు ఆశ్చర్యమైంది. గుహ ఇప్పుడు విశాలమైన ఒక పెద్ద ప్రాంగణంలోకి తెరుచుకున్నది. అందులో ఒక మూలన తన గుర్రం!

యువరాజు ఫిలిప్ గబగబా అటువైపు అడుగులు వేశాడు. గుర్రం అతన్ని చూసి సంతోషపడింది. కన్నీరు కార్చింది. అతను కూడా గుర్రాన్ని నిమిరాడు. దానికి ఎలాంటి గాయాలు కాలేదని నిర్ధారణ చేసుకున్నాడు. అయితే దాని కళ్లాన్ని పట్టుకొని ఎంత లాగినా అది మాత్రం కదల్లేదు!

అంతలో అక్కడ గోడకున్న చిన్న తలుపొకటి అతని దృష్టిని ఆకర్షించింది. తలుపు తట్టిన యువరాజు ఎలాంటి జవాబు రాలేదు. అయితే తలుపు మాత్రం మెల్లగా తెరుచుకున్నది.

లోపల గదులు ఖాళీగా ఉన్నాయి. అయితే ఒక మూలంగా కిరీటం ఒకటి పడి కనిపించింది! యువరాజు సంతోషంగా వెళ్లి ఆ కిరీటాన్ని పరిశీలించాడు. అంతకు ముందు తనకు అడవిలో దొరికిన కిరీటం లాంటిదే ఇది! అయితే దానిని పక్షి ఎత్తుకెళ్లింది కదా, ఇది మరొకటేమో.

యువరాజు ఆ కిరీటాన్ని తీసుకొని పరిశీలించాడు. దాన్ని తన తలమీద పెట్టుకొని, వెనక్కి తిరిగి వచ్చి, అన్ని వైపులా చూశాడు. 'ఎవరైనా ఉన్నారేమో' అని అరిచాడు. జవాబు లేని నిశ్శబ్దం...! యువరాజు నిట్టూరిస్తూ తిరిగి గుర్రం ఎక్కబోయాడు-

అంతలో అతని తలపైన ఉన్న కిరీటం కాస్తా జారి, గుర్రం మీద పడింది. చిత్రం! మరుక్షణం గుర్రం యువరాణిగా మారిపోయింది!

"కానీ యువరాణి ఇంత పెద్దగా ఉందేంటి?" అని ఆశ్చర్యపోయాడు ఫిలిప్. ఎందుకంటే ఇప్పుడు అతను యువరాణి మోకాళ్ల ఎత్తుకు కూడా రాలేదు!



"ఏంటిది, యువరాణి ఏరియల్?!" అని అరవబోయాడు అతను. అయితే అతని గొంతు ఇదివరకులా రానే లేదు..! కేవలం "మ్యావ్ మ్యావ్" అని శబ్దం మాత్రం వెలువడింది!!

యువరాజు ఫిలిప్ ఇప్పుడొక పిల్లిగా మారిపోయాడు!!

అతను గట్టిగా అరుస్తూ ఏదేదో చెప్పాలని యువరాణి కాళ్లను రాసుకుంటూ తిరిగాడు.

అయితే యువరాణి తను ఎవరో గుర్తు పట్టనే లేదు. పిల్లిని ముద్దు చేస్తూ" ఏంటి పిల్లీ! ఏంటి పిల్లీ!" అని మాత్రం అంటున్నది!

యువరాజు కళ్లల్లో నీళ్లు తిరిగాయి. "ఏం జరుగుతున్నది, ఎందుకిలాగ? తనకి పిల్లి రూపం ఎందుకొచ్చింది? యువరాణి గుర్రం ఎలా అయింది?!" అంతులేనన్ని ప్రశ్నలు అతని చిట్టి పిల్లి మెదడును తొలిచేశాయి.

ఇంతలో పిట్ట ఒకటి వింతగా అరుచుకుంటూ అక్కడికి వచ్చింది. తన కాళ్లతో పట్టుకొని ఉన్న మరో కిరీటాన్ని

తటాలున పిల్లి మీదికి జారవిడిచింది.



మరుక్షణం యువరాజుకి అసలు రూపం ప్రాప్తించింది! యువరాణి ముఖం విప్పారింది.

సంతోషంతో వాళ్లిద్దరూ కొద్దిసేపు ఈ లోకాన్ని మర్చిపోయారు. ఆ తరువాత ఇద్దరూ గుహలో నుంచి వచ్చిన దారినే బయటపడి నడకసాగించారు. రాజ్యాన్ని చేరుకున్నారు.

అసలు యువరాణి గుర్రం ఎందుకైందీ, యువరాజు పిల్లిగా ఎందుకు మారిందీ, తిరిగి వాళ్ల ఇద్దరికి యధారూపాలు ఎందుకొచ్చిందీ అర్థమైందా? యువరాణిని ఓ మంత్రగత్తె ఎత్తుకెళ్ళిందట! ఆమెని గుర్రంగా మార్చేసిందట! ఆమెని కాపాడాలంటే ఓ కిరీటం కావాలి. దాన్ని ఉపయోగించినవాడు పిల్లి ఐపోతాడు. మళ్ళీ వాడు మనిషి అవ్వాలంటే ఇప్పుడు రెండో కిరీటం కావాలి. పక్షుల పుణ్యమా అని ఆ రెండు కిరీటాలూ వీళ్లకు దొరికాయన్నమాట! అదీ కథ!!

**తలలు బోడులైన తలపులు బోడులా?**



ఎనిమిది వెంట్రుకలున్న ఓ ముసలాయన మంగలి షాపుకు వెళ్ళాడు.

బార్బర్ (విసుగ్గాను, వెటకారంగాను) : తాతగారూ! వెంట్రుకల్ని కౌంట్ చెయ్యమంటారా, కట్ చెయ్యమంటారాండి?!

తాతగారు (ఠీవిగా అద్దంలోకి చూసి మురిసిపోతూ): రెండూ కాదు, రంగు వెయ్!

బార్బర్: ఆఁ!!!

# పదాల్ని వెతికి పట్టుకోండి!

**ఎండలు, యువరాజు, క్షమాపణ. మోసగాళ్లు, గౌరవం, నిర్ణయం, పరిచయం, సామ్రాజ్యం, చీమలు, ఉదయం, మర్యాద, గాయం, సంబంధం, ఆకలి, సారాయి, చైతన్యం, అసాధ్యం, సందేహం, కారణం, పశువులు:-** *ఈ పదాలన్నీ క్రింది పట్టికలో దాగున్నాయి-నిలువుగా, అడ్డంగా, వాలుగా, క్రింది నుండి పైకి -ఎటుపడితే అటు! వాటిని వెతికి వాటి చుట్టూ గుండ్రాలు గీయండి!*

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ద | ర్యా | మ | సం | గా | జ్యం | మ్రా | సా | రో | డ | మ | చై |
| సా | అ | క | ద | క | మ | లి | లు | ము | మి | మొ | త |
| రా | క్ష | మా | ప | ణ | క | డ | వు | గ్య | ణం | వం | న్యం |
| యి | డ | ఆ | భో | ఆ | వా | యూ | శు | లి | ర | మి | మా |
| ప | ము | ఎం | డ | లు | లి | యూ | ప | తా | కా | వ | క |
| వం | రి | ఆ | క | ద | ఉ | నా | సం | మో | ధ్యం | ఆ | చీ |
| ము | సం | చ | ఎం | ద | యు | ధ్యం | డ | క | స | ణం | మ |
| ద | బ | లి | యం | గ్య | ము | వ | సా | చా | మ | గా | లు |
| సం | ర | ఉ | ర్ణ | వం | ము | డ | రా | అ | కా | య | ళ్లు |
| బం | దే | డు | ని | యం | గా | మి | లి | జు | వం | గ్య | కీ |
| ధం | వ | హం | మొ | ల | యం | ష్ట | ఈ | ర | ల | టి | క |
| అ | భా | గ్య | ప | త | గ | మీ | గౌ | భా | కి | గీ | పం |

# పదరంగం-86

*నిర్వహణ: డా. సిరి, మిర్యాలగూడ, నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం*

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | | ★ | 4 |
| 5 | | | ★ | 6 | |
| | ★ | ★ | 7 | | |
| 8 | 9 | | | ★ | |
| 10 | | ★ | ★ | 11 | |
| ★ | 12 | | | | |

**అడ్డం:**

1. 'లకబంద' ని సరిచేస్తే వచ్చే ఎడారి మొక్క! (4)
5. మన ముఖంలో- కదిలించగల ఎముక (3)
6. నక్షత్రమే, మరోలా (2)
7. 'కానుక' తిరగబడింది! (3)
8. నాటకాలు ప్రదర్శించే చోటు (4)
10. భారతదేశంలో అతి పొడవైన నది (2)
11. 'పేరుకున్నది' లో మొదటి రెండక్షరాలు (2)
12. శివుడి వాహనం!? (5)

**నిలువు:**

1. 'కదనం' అంటే యుద్ధం, మరి యుద్ధం జరిగే చోటుని ఏమని పిలుస్తారు (5)
2. 'లవకుశ' లో మొదటి రెండక్షరాలు (2)
3. పెద్ద రాయి (2)
4. సత్యభామ చేతిలో చంపబడిన రాక్షసుడు (6)
6. దీర్ఘం ఉండే తను (2)
7. 'పెన్' అంటే? (2)
9. ఆకాశానికి మరో పేరు (3)
11. 'పేర్లు'కి ఏకవచనం (2)

అడ్డం-నిలువు ఆధారాల సహాయంతో ఈ గడుల ను నింపగలరేమో చూడండి.

నింపిన పదరంగాన్ని, కేవలం పోస్టుకార్డుపై రాసి, మాకు అందేట్లు పంపండి.

మీ బడి పేరు, తరగతి, మీవాళ్ల ఫోను నంబరు తప్పక రాయండి.

సరైన సమాధానం రాసి ఎంపికైన ముగ్గురు పిల్లలకు కొత్తపల్లి - 87 ని బహుమతిగా పంపిస్తాం!

**కొత్తపల్లిని మీ మిత్రులకు, మీరు చదివిన బడులకు, మీ సమీపంలోని లైబ్రరీలకు బహూకరించండి!**




రాబోయే 12 సంచికలకై ముందస్తు చందా:

వ్యక్తులకు: **300/-** (పోస్టేజీ మరియు యస్సెమ్మెస్ ఛార్జీలు కలిపి)

సంస్థలకు: **350/-**

గమనిక: అచ్చయిన పుస్తకాలు ఎప్పటికప్పుడు సాధారణ పోస్టులో పంపబడతాయి.

NEFT TRANSFER కోసం అక్కౌంటు వివరాలు:

"Kottapalli Prachuranalu"
SB A/c 62320333310,
State Bank of Hyderabad
Dharmavaram Branch
IFSC: SBHY0020902

Transfer వివరాలను మాకు మెయిల్ ద్వారా తెలియజేయండి: team@ kottapalli.in

(బ్యాంకు వారి కొత్త నియమాలననుసరించి, "క్యాష్ హ్యాండ్లింగ్ చార్జీలు"గా ప్రతిసారీ రూ. 50 అదనంగా చెల్లించవలసి వస్తున్నది.. అందువల్ల బ్యాంకులో డబ్బు కట్టకండి- నేరుగా మీ అక్కౌంటు నుండే ట్రాన్స్ఫర్ చేయగలరని ప్రార్థన)

**ప్రస్తుతం అందుబాటులో ఉన్న కొత్తపల్లి ప్రింటు పుస్తకాల వివరాలు:**

| క్రమ సంఖ్య | వివరాలు | ఒక సెట్ లోని పుస్తకాల సంఖ్య | స్టాకులో ఉన్న సెట్లు (సుమారుగా) | వెల (రూ) **(పోస్టేజి రూ 50 అదనం)** |
|---|---|---|---|---|
| 1 | 2011 set | 9 | 18 | 180 |
| 2 | 2012 Set | 11 | 24 | 220 |
| 3 | 2013 Set | 7 | 17 | 175 |
| 4 | 2014 Set | 10 | 450 | 250 |
| 5 | 2015 Set | 7 | 1099 | 175 |

మరిన్ని వివరాలకై సంప్రతించండి: కొత్తపల్లి ప్రచురణలు, 1-127/A, యంఆర్వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా, 515101. ఫోను: 7702877670, 9000453887. ఇ-మెయిలు : team@kottapalli.in

**RNI Regn No. : APTEL/2014/62705** Date Of Publishing: 10/09/2016 **Postal Regn No: HDP/008/2015-2017**

## పరిశుభ్రత

*డి.ఆర్. హిమశ్రీ, 9 వ తరగతి, రాధ స్కూల్ ఆఫ్ లర్నింగ్, అనంతపురం.*

అనంతపురంలో నరేష్, సుజన్, రాజు ముగ్గురూ మంచి మిత్రులు, వాళ్ళు జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో 6 వ తరగతి చదువుతున్నారు. వారికి ఆటలంటే ప్రాణం. అలాగే చదువులూ బాగా చదివేవారు.

ఒక రోజు ఆటలు ఆడుతుండగా సుజన్ కళ్ళు తిరిగి కింద పడిపోయాడు, అది చూసిన నరేష్, రాజు భయపడి గట్టిగా ఏడ్చారు. దగ్గరలో ఉన్న వ్యాయామ ఉపాధ్యాయులు వారిని ఓదార్చి సుజన్ ను ఆసుపత్రికి తీసుకెళ్ళారు.

ఆసుపత్రిలో డాక్టరు రక్తపరీక్ష చేసి సుజన్ కు " డెంగ్యూ జ్వరం" వచ్చింది, ఇది ప్రమాదకరమైన జ్వరం! జాగ్రత్తగా ఉండాలి. ఇది దోమల వల్ల వస్తుంది. ఈ మధ్య కాలంలో దోమల వల్ల చాలా జబ్బులు వస్తున్నాయి. పరిసరాలు శుభ్రంగా ఉండాలి. ఎక్కడ నీళ్ళు నిలువ ఉంటే అక్కడ దోమలు పెరుగుతాయి. వాటిని పెరగనీయకుండా తగిన జాగ్రత్తలు తీసుకోవాలి" అన్నారు.

ఈ మాటలు రాజును, నరేష్‌ను ఆలోచింపజేసాయి. తమ స్నేహితుడికి వచ్చిన జ్వరం ఇంకెవరికీ రాకూడదని నిశ్చయించుకున్నారు వాళ్ళు. బడిలో పిల్లలందరికీ ఈ విషయం చెప్పారు. ఇంటికి వెళ్ళి తల్లిదండ్రులకి చెప్పారు. పెద్దలెవ్వరూ సరిగా స్పందించలేదు. దాంతో రాజు, నరేష్ మిగిలిన పిల్లలందరినీ కలుపుకొని పాఠశాల పరిసరాలలో నీళ్ళు నిలువ ఉన్నచోట్లను, చెత్తా చెదారం ఉన్న చోట్లను శుభ్రం చేసారు. అంతటితోఆగిపోకుండా తమ ఇంటి చుట్టు ప్రక్కల, అందరూ నడిచే దారుల ప్రక్కన కూడా శుభ్రం చేయటం మొదలు పెట్టారు.

ఆ సమయంలో అటుగా పోతున్న రమేష్ అనే అతనొకతను వీళ్ళను చూసి- 'ఇదేంటి పిల్లలూ?! మీరంతా ఏం చేస్తున్నారిక్కడ?" అని అడిగాడు. జరిగిన సంగతులు అన్నీ చెప్పారు వాళ్ళు. "పిల్లలూ! మీరు చాలా మంచి పని చేస్తున్నారు. పెద్దవాళ్లెవరూ మీకు సహకరించట్లేదా? అన్నాడతను. మౌనంగా ఉన్న పిల్లల్ని చూసి అతను సంగతి అర్థంచేసుకొని, "ఏమీ పర్లేదు- మీకు నేను సహకరిస్తాను!" అని చెప్పి వెళ్ళాడు.

" 'సహకరిస్తాను' అని చెప్పి ఏమీ చేయకుండా వెళ్లాడు చూడండిరా" అని పిల్లలు నవ్వుకున్నారు. అయితే మరుసటి రోజు దినపత్రికలో "నేటి బాలలే రేపటి పౌరులు అనడానికి చక్కటి ఉదాహరణ- అనంతపురం జిల్లా పరిషత్ పాఠశాల పిల్లలు చేస్తున్న పని అమోఘం" అని ఒక పెద్దఫోటో, ఎవరో రమేషట- రాసిన ఒక చక్కటి ఆర్టికల్ ప్రత్యక్షమైనాయి!

ఈ వార్తని చదివిన తల్లిదండ్రులు సంతోష పడ్డారు; దానితో బాటు "మేము పెద్దవాళ్లమై ఉండీ ఏమీ చేయలేదే" అని సిగ్గుకూడా పడ్డారు. పిల్లలతో కలిసి వాళ్ళు కూడా పనిలోకి దిగారు. అనతికాలంలోనే 'అనంతపురం జిల్లా అంటే రోగాలు లేని జిల్లా' అని పేరు వచ్చింది!

Printed and Published by Narayana Sarma on behalf of Kottapalli Prachuranalu and printed at Mudrica Offset Printers, Vijayawada and published at "Kottapalli", 1-127/A, Near MRO Office, Chennekothapalli, Ananthapuram District, AP-515101. Editor: Narayana Sarma.